

C1

నయాగరా జలపాతంపై సాహసదృశ్యం

PRSVMOZA151

సాహిత్య ప్రస్థానం
జులై 2013
సంపుటి : 12 సంచిక : 7

# ప్రకృతి విపత్తు

దేశాన్నే చలింపజేసిన ఉత్తరాఖాండ్ ఉపద్రవంలో ప్రాణాలతో బయటపడిన వారిని ఆదుకునే బృహత్తర కార్యక్రమం చాలా మిగిలి ఉంది. వాతావరణం అనుకూలించకపోవడం వల్ల సహాయ కార్యక్రమాలకు అంతరాయం కలగడమే గాక హెలికాప్టర్ కూలిపోయిన ప్రమాదంలో 19 మంది మరణించడం విషాదంలో విషాదంగా మారింది. విరుచుకుపడిన వెల్లువలో కొట్టుకుపోయిన వారు పోగా విగతజీవులుగా దొరికిన వారి మృత దేహాల దహన కాండ కూడా పెద్ద సమస్యగా, సవాలుగా మారిన స్థితి. టూరిజం ప్రధానంగా ఉండే ప్రదేశాలు గనక దానిపై ఆధారపడి బతికే స్థానికులతో పాటు అందుకు అనేక రెట్లు సంఖ్యలో యాత్రీకులు చిక్కుకుపోయారు. దక్షిణాది రాష్ట్రాల వారు, అందులోనూ తెలుగువారు ఎక్కువగా ఉండటంతో రాష్ట్రంపై దాని ప్రభావం తీవ్రంగా ఉంది. మొదటి దశలో సహాయ చర్యలకు దిగడంలో జాప్యం జరిగింది. తర్వాత ప్రభుత్వం మంత్రులను పురమాయించి ఎ.పి. భవన్‌లో యాత్రికులను బసచేయించి కొన్ని చర్యలు ప్రారంభించింది. ఊహించని స్థాయిలో విరుచుకుపడిన విపత్తుతో పోల్చినపుడు సహజంగానే సహాయ చర్యలు సరిపోవు. మన పాలకులకు, అధికారులకు రివాజుగా మారిన అలసత్వం సరేసరి. ఈ నేపథ్యంలో సహాయ కార్యక్రమాలపై వాదోపవాదాలు పెరిగి రాజకీయ రంగుపులుముకున్నాయి. రాష్ట్రంలో రాజకీయ వాదవివాదాలు సాధారణ స్థాయిని దాటిపోయిన సందర్భాలు ఉన్నా ఇంత విపత్కర పరిస్థితిలోనూ రాజకీయాలే ప్రధానమైనాయన్న మాట రావడం ఎవరికీ మంచిది కాదు. ఇకనైనా సహాయ కార్యక్రమాలపైనే సర్వజనులూ, సకల పక్షాలూ దృష్టి కేంద్రీకరిస్తాయని ఆశించాలి. ఇటువంటి ప్రకృతి విపత్తులకు అవకాశాలున్న ప్రదేశాలలో సత్వర సహాయం అందించడానికి తగిన రక్షణ వ్యవస్థ ఏర్పాటుకు వెంటనే చర్యలు తీసుకోవాలి.

.... .... .... ..... .... .....

ప్రముఖ రచయిత, అనువాదకులు ఆలూరి భుజంగరావు ఇటీవల కన్నుమూశారు. ప్రజా విప్లవకారుల జీవితాలను, రాహుల్ సాంకృత్యాయన్ వంటి వారి రచనలను తెలుగువారికి పరిచయం చేయడానికి తన కలాన్ని అంకితం చేసారు. వారికి ప్రస్థానం నివాళి అర్పిస్తున్నది.

బొమ్మలు : తుంబలి శివాజి, వెంకటేష్, భాస్కర్, రమేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# అక్షరాల పక్షులు

డా॥ సి. నారాయణరెడ్డి



తెరిచివున్న తెల్లకాగితం మీద
వాలిన అక్షరాల పక్షులు
ఎప్పుడూ ఎగిరిపోయేవి కావు
అవి నిశ్చలంగా వుంటాయి.
తమ అంతరంగాలను చదివే
చూపుల కోసం
ఎదురుచూస్తుంటాయి
వాటి నిరీక్షణకు వ్యవధిలేదు
పసవున్న చూపులొచ్చి
వాటి రెక్కలను దువ్వినప్పుడు
అవి కాలాన్ని మరిచిపోతాయి
అంతటితోనే వాటికి సంతృప్తిలేదు.
ఆ చూపులు తమ గుండెల్లోకి దూరి
గుండెల మాటున వున్న
కువ కువ రవళులను వింటూ తలలూపినప్పుడు
ఆ అక్షరాల పక్షులు
తమలో తామే
నిలువెత్తుగా పొంగిపోతాయి.
పక్కనున్న పచ్చని తరుశాఖలు
తమను రమ్మని ఈలలు వేస్తున్నా
తనతో చేతులు కలిపి విహరించాలని
నీలాంబరం ఆహ్వానిస్తున్నా
ఆ అక్షరాల పక్షులు
తమకు ఆశ్రయమిచ్చిన కాగితాన్ని
వదిలిపెట్టి వెళ్లడానికి
మొగ్గు చూపవు
అవి కాగితం మీద వాలినప్పుడే
నిర్ణయించుకున్నాయి.
కడవూపిరి వరకు
తమ సుస్థిర నివాస స్థలం
కాగితమేనని
తమపై ప్రసరించే ఆ చూపులే
తమ ఆత్మబంధువులని.

కథ

# శిఖరం



ఉదయమిత్ర
9985203376

పొద్దున్నే చారి నుండి ఫోను..

"ఈ మనిషి మమ్మల్ని బతుకనియ్యడ్రా.. మళ్లా ఏ మీటింగ్‌కు రమ్మంటాడో" అని విసుక్కుంటూ ఫోన్ తీశాను.

"అన్నా... గుడ్ మార్నింగ్"

"ఊ.. గుడ్ మార్నింగ్. చెప్పు..."

"మొగిలిగిద్దల ఈ రోజు ఓ మీటింగ్ ఉంది. మీరు తప్పక రావాలె.."

"మీటింగా... నాకు కుదరదు చారీ.. చాలాపన్లున్నాయి...పైగా నేను అల్సిపోయి ఉన్న"

"కాదు... కాదు.. మీరు ఓపిక చేసుకునయినా తప్పనిసరిగారావాలె.. అసలా మీటింగ్‌కు ఎవరొస్తున్నారో తెలిస్తే, మీరు తప్పకవొస్తారు..."

"ఎవరొస్తున్నరు"

"ఆవొచ్చేవ్యక్తి దక్షిణాఫ్రికాలో పనిజేసి రిటైరయిన సుప్రీమ్‌కోర్టు జడ్జి"

"ఉండొచ్చు.. నా వల్లగాదు.."

"మీకు ఇంకో విషయం చెప్పాలె.. అతను గుడ్డివాడు"

ఒక్క క్షణం దిమ్మెరపోయాను.. గుడ్డివాడయి ఉండి సుప్రీమ్‌కోర్టు జడ్జి అయినాడా? నమ్మలేని విషయం...

"నిజంగానా?" నమ్మలేనట్లడిగాను...

"అయ్యో...నిజం సార్.. ఒట్టు.. మీకింకొ సర్‌ప్రైజ్ ఉంది... ఆయన దక్షిణాఫ్రికా ఉద్యమ సంస్థ ఎ.ఎన్.సి (ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రేస్) తరుపున ఉద్యమంలో పాల్గొన్నాడట..."

ఇది మరో అద్భుతం..

"నిజంగానా... గుడ్డతను ఉద్యమంలో పాల్గొన్నాడా? హైలీ ఇంట్రెస్టింగ్ అదీ తెల్లోళ్ల క్రూరనిర్బంధంలో"

"అదే నేను జెప్పేది... పుట్టింది ఉత్తర ప్రదేశ్‌లోని ఓ పల్లెలో.. పెరిగింది దక్షిణాఫ్రికా... ముస్లిం కుటుంబీకుడు... బ్రెయిలీ లిపి నేర్చుకొని, ఎంతెంత సాధన జేసిండో.. అక్కడే సుప్రీం కోర్టు జడ్జిగ పనిజేసి రిటైరయినాడు"

"గుడ్డతను జడ్జిగావడమేమిటీ? అతను ఉద్యమంలో పాల్గొనడమేమిటీ ? నాకంత నమ్మబుద్ధిగావటం లేదు చారీ.."

"ఇంతకు మీరు వొస్తున్నారా? లేదా?"

"ఒకే... ఒకే"

x x x

మేం మొగిలిగిద్ద చేరేటప్పటికే మీటింగ్ మొదలయ్యింది. జడ్జి గారే మాట్లాడుతున్నాడు... తెల్లని పైజామా, కుర్తాలో మల్లెపూవులా ఉన్నాడతను.. బక్క పలుచటి మనిషి.. ఆరడగులు పొడవు. స్ఫురద్రూపి.. అతను తన ఆత్మ విశ్వాసపు కళ్లతో సభనుపరికించి మాట్లాడుతున్నాడు.. ఈ పిల్లలు, ఈ టీచర్లు, ఈ గ్రామస్థులు, ఈ గాలి తనకు ముందే తెలుసన్నంత హోమ్లీగా మాట్లాడుతున్నాడు... నా ఎదుట.. అంగ వైకల్యాన్ని జయించిన ఓ నూతన మానవుణ్ణి చూస్తున్నాను... ఆ అనుభూతిని లోపలికి ఇముడ్చుకోనీకె, రెండు నిముషాలు కళ్లు మూసుకున్నా...

అతన ఇంగ్లీషులోనే మాట్లాడుతున్నాడు.. పిల్లలకేదో అర్థమయినట్టే ఉంది- బెంగాలీ పాటలు అర్థంగాకపోయినా, ఆనందాన్నిస్తాయంటారు.. ఇదీ అంతేనేమొ. ఉపన్యాసం ధారాపాతంగా సాగిపోతోంది... అతను తన జీవితసారాన్ని రంగరించి పిల్లలకు చిన్న చిన్న మాటలల్లో వివరిస్తున్నాడు. (ఈమొత్తం ఉపన్యాసం తెలుగులోకి అనువదించి చెప్పారు)

"మీరు దేశ భాగ్యవిధాతలు..

మీరు పువ్వులు, మీరు నవ్వులు..

మీరు నిండైన ఇంద్రధనుస్సులు..

మీరు భవిష్యత్తును పండించేపంట కాలువలు"

పిల్లలూ.. మీరు నడిచేదారిలో ఎన్నో ఆటంకాలు రావొచ్చు.. అయితే ఎప్పుడూ వెనుకడుగువేయొద్దు.. అన్నింటినీ ఓపికగా, ఆత్మ విశ్వాసంతో, ఒంటరిగానయినా ఎదుర్కొవాలె.." ఎవరూ కేక వినీ రాకపోయినా సరే/ నీవు ఒక్కడవే, ఒక్కడవే/ ఒక్కడవే పదవోయ్" అన్న రవీంద్రుని మాటలు గుర్తుంచుకోవాలె..

పిల్లలూ.. ఏదయినా సమస్యవొస్తే ఏడుస్తూ కూచోగూడదు. ధైర్యంగా ముందుకు నడవాలె.. అన్నింటికన్నా "ఆత్మ విశ్వాసం" ముఖ్యం. అది ఉంటే కొండల్ని పిండికొట్టవొచ్చు. ఇటు చూడండి.. నాకు కళ్లు లేవు.. అయినా ఆత్మ విశ్వాసమే రెండు కళ్లుగా బతికాను.. ఎక్కడో ఉత్తరప్రదేశ్‌లోని పల్లెటూరిలో పుట్టాను.. కళ్లు లేవని నన్నందరూ వెక్కిరించారు... తీసి పారేశారు. అయినా వెనుకడుగువేయలేదు. బ్రెయిలీ లిపి నేర్చుకున్నా.. కఠోరశ్రమ జేసినాను.. ఇవ్వాళ ఈ రూపంలో మీముందు నిలబడ్డాను.

కాబట్టి చదువయినా, ఉద్యమమయినా అన్నిటికీ ఆత్మ విశ్వాసం మూలం.. అదిలేని వాడు కళ్లున్న గుడ్డివాడు"

మొత్తం సభ అంతా చప్పట్లతో మారుమోగిపోయింది. గాలికి అటూ ఇటూ ఊగే నిండైన వరిపంటను దలపించిందా దృశ్యం. అతను ఉపన్యాసమే చెబుతున్నాడో శివారెడ్డి కవిలాగ కవిత్వమే గానం జేస్తున్నాడో తెలీదుగాని, అందర్నీ మంత్ర ముగ్ధుల్ని చేసి పడేశాడు.

జడ్జిగార్ని హైదరాబాద్ నుండి ఈ చిన్న పల్లెటూరికి తెప్పించి నందుకు మాశ్యామ్ సుందర్‌సారుకి థాంక్స్ చెప్పాలి.

x x x

మీటింగ్ అయిపోయింది...

పిల్లలందరికీ చాక్లెట్లు పంచుతున్నారు. అందరూ బృందాలుగా విడిపోయి చర్చించుకుంటున్నారు.

ఈ మొత్తం మీటింగ్‌లో నేనొక మనిషి కోసం ఆరాటంగా వెతుకుతున్నా.. ఆమె జడ్జి గారి భార్య.. జడ్జిగారు ఈ స్థాయికొచ్చాడు అంటే అతని భార్య పాత్ర కూడా ఖచ్చితంగా ఉండి తీరాలె.. ఎవరామె? ఎట్లా ఉంటది? ఎట్లా భరించింది ఇతన్ని?

ఆఫీసు రూము ముందు నిలబడి మహిళా టీచర్లతో మాట్లాడుతోంది ఆమె.. లావుగా, బొద్దుగా, తెల్లగా ఉంది - సుమారుగ యాభై అయిదేళ్లుంటాయేమొ. పేరు సుల్తాన బేగమట. ఆమె కళ్లద్దాలు మెడ నుండి వేలాడుతున్నాయి.

ఆమె ఇంగ్లీషులో మాట్లాడుతోంది - ఎంతటి ఆత్మ విశ్వాసమో.. అసలు ఆత్మ విశ్వాసం వాళ్ల ఇంటి పేరేమొ.

నిజం చెప్పాలంటే నాకు గాని, ఆ మహిళా టీచర్లకు గాని ఇంగ్లీషులో మాట్లాడటం సరిగ్గా రావటం లేదు.. అయినా అక్కడ భాష ముఖ్యం కాదు. భావం ముఖ్యం - రెండు ఖండాంతరాల మధ్య మానవ సంబంధమైన జీవవాహిక ఏదో మా మధ్య ప్రవహిస్తోంది. పొట్టి పొట్టి మాటలు.. కుతూహలాలు.. ప్రశ్నలు.. అన్నింటికీ ఆమె నవ్వుతూ ఓపిగ్గా సమాధానం చెబుతోంది.

"మేడం.. ఏమీ అనుకోవద్దు... మీరు సార్‌కు ఎట్ల దెల్సు?" కుతూహలం పట్టలేక అడిగిందో టీచరు.

"ఓ.. అదా.. అదొక కథ, నేను సార్ దగ్గర అప్రెంటిస్‌గా చేరాను. అప్పుడే నాకతను తెల్సు.. మొదట చేరేటప్పుడే అనేక సందేహాలొచ్చినయ్..." ఈయనేం నేర్పిస్తాడబ్బా.. కళ్లులేవు గదా" అనుకున్నా. కాని చేరిన నెలలోపలే నాకొకటి ముఖ్యంగా తెల్సింది" ఇతనికి ఆత్మవిశ్వాసం ఎక్కువ" అని... అదే నాకూ నేర్పించాడు.. దాంతో జీవితంలో నాకు గల బెరుకుదనం పోయి, ఫ్రెండ్లీగా

తయారయ్యాను... హి ఈజ్ ఏ ఫ్రెండ్, ఫిలాసఫర్, గైడ్ టు మి.

"మరి పెళ్లి... ఇదంతా..."

"ఓ... పెళ్లి.. అదంతా ఓకల లాగ జరిగిపోయింది. మేమిద్దరం ముస్లిములమే అయినా మా శాఖలు వేరుగావడంలో ఇళ్లల్లో గొడవలు జరిగాయి.. పైగా అతను గుడ్డి మనిషి.. పేదకుటుంబం నుండి వొచ్చాడు.. మేము పెద్ద ఖాన్ దాన్ నుండి వొచ్చాం.. అంతస్తుల తేడా కూడా ఉంది – అయినా నేను మొండి కేయడంతో నన్ను బయటికి వెళ్లగొట్టారు. రిజిష్టరు పెళ్లి జేసుకున్నాం... ఇప్పుడంతా సద్దుమణిగిందనుకోండి"

"ఏంతయినా మీరు గ్రేట్ మేడమ్"

"ఎందుకేమిటి?"

"సార్‌కు కళ్లు లేవు.. ఎన్నో సమస్యలుంటాయి... సార్ పనులూ, మీ పనులూ.. అన్నింటినీ ఓపిగ్గా చేసుకోవడం విశేషం కదా.."

"నో..నో.. మీరట్లా అనొద్దు. అతనూ మనలాంటి మామూలు మనిషే.. కళ్లు లేవు అంతే.. అతను తన పనులు తను చక్కగా చేసుకోగలడు.. ఏదయినా అత్యవసరమయితే తప్ప, నేను జోక్యం కల్పించుకోను.."



ఆమాటలు విన్న మహిళా టీచర్లు తెగ ఆశ్చర్యపడిపోయేరు.. వాళ్లు ఊహించింది ఒకటి. ఈమె చెబుతున్నది ఒకటి. జడ్జి గార్కి కళ్లు లేనందువల్ల తానెన్ని బాధలుపడ్తున్నదో.. వగైరావగైరాలు చెబుతుందనుకున్నారు గాని అందుకు విరుద్ధంగా అతను తన పనులు తానేచేసుకుంటాడని చెబుతోందామె...రియల్లీ అన్‌బిలేవేబుల్ తమ తమ ఇళ్లలో భర్త మహాశయులు అన్ని విధాల ఆరోగ్యంగా ఉండి. ప్రతి పనీ తమ చేత చేయించుకుంటారు. భర్తలు ఉద్యోగాలు జేసినా, గాలికి తిరిగినా, తాగుబోతులయినా, దద్దమ్మలయినా, తమకు ఇంటి చాకిరీ తప్పడంలేదు. వాళ్లు కాలుమీద కాలేసుకుని పేపరు చదువుతూనో, టి.వి చూస్తూనో ఉంటే, తమ వంటింట్లో మగ్గుతూ ఉంటారు. డ్యూటీ సరేసరి.. ఒక్కసారిగ ఈయనతో పోల్చుకుంటే" నక్కకూ, నాగలోకానికీ" ఉన్నంత తేడా కన్పించింది.

మనిషికి ఏదయినా లోపం ఉంటే దానికి సంబంధించిన శక్తి మరో అంగానికి చేరుతుందంటారు.. ఉదాహరణకు, మనిషికి చెవులు వినబడకపోతే కళ్లు చురుగ్గా పనిజేస్తాయంటారు. చేతులు విరిగితే కాళ్లకు శక్తి పెరుగుతుందంటారు.. అదేమిటో మనస్తత్వ శాస్త్రవేత్తలో, డాక్టర్లో చెప్పాలి.

కళ్లులేని వాళ్లకు అపారమైన మేధోశక్తి ఉండడం మనం చూస్తూ ఉంటాం. రైలులో అద్భుతంగాపాడే గుడ్డి భైరప్పనాకు బాగా తెల్సు.. రూపాయి నోటుకీ, ఉత్త కాగితానికీ తేడా ఇట్టే కనిపెట్టేవాడు. గొంతు విని మనిషి పేరు చెప్పగలిగేవాడు.

హిందీ సినిమా రంగంలో అద్భుతమైన సంగీతాన్ని అందించిన రవీంద్రజైన్ గుడ్డివాడేగదా...

మా ఇంటి పక్కన "గుడ్డి సత్తెమ్మ" అని బంధువొకామె ఉండేది.... గుడ్డిదయినా ఎన్ని తెలివి తేటలో.. ఎన్ని తేట తెలుగు పాటలో...

"బసువని బసువో...
చూడావోదమురారో
బసువని బసువో"

అంటూ విసుర్రాయి విసుర్తుంటే, వేం చేతులు కలపాల్సిందే... నిముషాల్లో జొన్నలు పిండికావాల్సిందే...

ప్రతి ఆచారమూ, సాంప్రదాయమూ క్షుణ్ణంగా తెల్సు. ఎవరెవరో ఆమె దగ్గరికి సలహాకు రావడం నాకు ఆశ్చర్యమనిపించేది.

"ఏందమ్మా ఇది... మీకేమొ కళ్లున్నాయి. ప్రపంచం తెల్సు. ఆమెకేమొ కళ్లు లేవు... ఎప్పుడో ఒకసారి తప్ప ఇల్లు విడువదు. మీరు ఆమెను సలహాలడుగుడేంది" అని మా అమ్మతో గొడవపెట్టుకుంటే," అరేయ్.. దానికి కళ్లు లేవు గాని ఒళ్లంతా కళ్లేరా.. అది దేవుడిచ్చిన వరం రా మాకందరికీ", అని గర్వంగా చెప్పేది. పండుగలొస్తే మొదటి ముద్ద ఆమె తినాల్సిందే మా ఇళ్లలో.

ఇప్పుడంటే పరిస్థితిమారింది గాని, నాకు యుక్త వయస్సు వొచ్చేదాంక, ఆమె చుట్టు పక్కల ఇళ్లను శాసించే దనుకోండి... (ఆఖరికి చిట్టీల విషయంలో బంధువులు మోసం చేసేసరికి, చివరి రోజుల్లో కుమిలి కుమిలి చనిపోయింది. అదివేరే విషయమనుకోండి) మనుషులపై ఆమెకున్న "పట్టు" జూస్తే ఆశ్చర్యమేసేది.

ప్రసిద్ధ కవి జాన్ మిల్టన్ తన 40వ ఏట కంటిచూపు పోయినాంకనే సుప్రసిద్ధ కావ్యాలు" "పారడైజ్ లాస్ట్ పారడైజ్ రీ ఎగైన్" రాశాడంటారు. అతను చెబుతూ ఉంటే, అతని ఇద్దరు కూతుర్లు రాసేవారట.

ఇట్లా మనుష్యులు తమ అంగవైకల్యాల్ని జయించి మానవ జాతికి కొత్త ఊపిరులూదుతుంటే, ఏ అంగ వైకల్యమూ లేని మనుష్యులు మానసిక వికలాంగులయి, హీనులై, పేడలో పురుగులై, కామాంధులై, దుమ్ములో ధూళిలో సైడు కాలువలో దొర్లుతూ మానవ జాతికే మచ్చను దెస్తున్నారు...

x x x

మీటింగ్ అయింతర్వాత అందరి దగ్గర సెలవు తీసుకొని మాకు ఆతిథ్యమిచ్చిన శ్యామ్ సుందర్ సార్ ఇంటికి బయలుదేరాం... జడ్జి గారు కారు మీద రావటానికి ఒప్పుకోలేదు... కాలి నడకనే పోదామన్నాడు.. అతను పల్లెటూరి రోడ్డును 'ఫీల్' కావాలనుకున్నాడు...

ఒక విచిత్రమైన అనుభూతి.. ఆనందం.. జడ్జిగారు మధ్యన.. మేమందరం చుట్టూరా గుంపుగా నడుస్తున్నాం.. నేను అతని వెనకాల కొంత దూరంలో నడుస్తున్నా.. అతను నవ్వుతూ, జోకులేస్తూ.. ఆ రోడ్డేదో తనకు ముందే తెల్సినట్టు పద్ధతిగా నడుస్తున్నాడు.. ఎటు వంటి తడబాటులేదు. అతని నడకలో ఏదో గాంభీర్యం ఉంది. అతను మాకు నడుస్తున్న శిఖరంలా అనిపించాడు.

ఇండ్లల్లో నుంచి జనం బయటికొచ్చి అతని వైపు అభిమానంగాను, ఆశ్చర్యంగాను చూస్తున్నారు.. చాలామంది పనులు మానేసి ఆయన్ను చూడ్డానికి రావటంతో మొగిలిగిద్ద రోడ్డుకు కొత్త కళ వొచ్చినట్టయ్యింది.

ఎవరి సంగతి ఏమోగాని.. నాకయితే అతని ప్రతికదలికా ఒక ప్రత్యేకమైనదిగానూ, స్ఫూర్తి దాయకంగాను అన్పించింది. లేకపోతే ఎక్కడో ఉత్తరప్రదేశ్ పల్లెలో పుట్టి, బ్రెయిలీ లిపి నేర్చుకొని, దక్షిణాఫ్రికాలో సుప్రీంకోర్టు జడ్జిగావటమేమిటీ? అనేకానేక నిర్బంధాలకు లోనయిన ఎ.ఎన్.సి (ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్) ఉద్యమంలో పాల్గొనడమేమిటీ? నాకయితే ఏదో అద్భుతమైన కల భూమ్మీదకు దిగివొచ్చినట్టయ్యింది.

"సారు.. దక్షిణాఫ్రికా ఉద్యమంలో పని జేశాడన్నారు గదా..."

ఏం పని జేసేవాడో?" అమాయకంగా పక్కనున్న చారిని అడిగాను...

"చెబితే నమ్మరు..." అన్నాడతను నవ్వుతూ.

"చెప్పు నేను నమ్ముతాను.." బతిమిలాడాను.

"ఆయుధాల్ని సరఫరా జేసేవాడు"... నవ్వుతూ చెప్పేడతను

"ఓ మైగాడ్" ఆయుధాలు స్మగ్లింగ్ జేయడమా?" ఆశ్చర్యపోవడం నావంతయ్యింది.

"అవును మరి"

"ఎట్లా?"

"సూట్‌కేసులో.."

"అనుమానం రాలేదా ఎవరికీ..."

"గుడ్డి మనిషి గదా.. అనుమానం ఎవరికయినా ఎందుకొస్తుందీ..."

అనెబెలెవిబుల్

"అంతేమరి"

మాటల్లోపడి ఇల్లు చేరుకున్న సంగతే మర్చిపోయాం...

అంతపెద్దదీ... మరీ చిన్నదీ కాని మధ్యస్తపు ఇల్లు... ఎత్తయిన ప్రాంతంలో కట్టారు... మెట్లు ఎక్కి వెళ్లాలి.. ఇంట్లోకి పోవాలంటే సుమారు ఎనిమిది తొమ్మిదిమెట్లెక్కాలి.

"ఇప్పుడేం చేస్తాడోచూద్దాం" అని అందరం ఊపిరి బిగబట్టి చూస్తున్నాం.. మా మిత్రుడు వెంకటేష్ దగ్గరగా వెళ్లి జడ్జి గారి చేయిపట్టుకున్నాడు, మెట్లెక్కించడాన్కి (వొద్దొద్దు. పట్టుకోవొద్దు.. ఆయనే స్వయంగా మెట్లెక్కుతాడు)" అంది సుల్తానాబేగం. వెంకటేశ్ అయిష్టంగానే చేయి వొదిలేశాడు అతను నెమ్మదిగా... పరిచయమున్న మెట్లలాగే ఎక్కుతూ పైకి చేరుకున్నాడు. ఇంటి వాళ్లందరూ అతడిని సాదరంగా ఆహ్వానించారు...

x x x

తర్వాత అందరం డైనింగ్ టేబుల్ చుట్టూ చేరాం.. వాష్ బేసిన్ ఆ పెద్ద హాల్లో ఓమూలకు ఉంది.. మళ్లీ సహజ కుతూహలుడైన మా వెంకటేశ్ జడ్జిగారి చేయిపట్టుకున్నాడు.. ఆయన సున్నితంగా విడిపించుకొని, ఎక్కడుందో సూచనలియ్యమన్నాడు.. స్వయంగా నడిచి వెళ్లి వాష్ బేసిన్‌కాడ చేయి, ముఖం కడుక్కొని వొచ్చాడు. ఇంటివాళ్ళతో సహా అందరమూ నిశ్శబ్దంగా అతడినే గమనిస్తున్నాం.. ఎక్కడాతత్తరపాటు లేదు...

భక్ష్యాలు తింటూ ఉంటే, జడ్జి గారు వాటిని చేసే విధానం అడిగాడు. శ్యామ్‌సుందర్ సారు ఇంగ్లీషులో వివరించారు. "ఓ.. అట్లయితే ఇవి మా ఇంట్లో తయారు జేసుకోవాల్సిందే'' అన్నాడతను నవ్వుతూ...

భోజనమయ్యింది... తన గిన్నెతానే తీసుకువెళ్లి వాష్ బేసిన్ కాడ శుభ్రంగా కడుక్కుని వొచ్చేశాడు. ఈసారి ఎవరూ సూచనలివ్వకపోవడం గమనార్హం.. అతనికి ఆత్మవిశ్వాసమే చూపు...

ఎవరి మీదా ఆధారపడకపోవడం కఠోరశ్రమ తర్వాత అలవడిన గొప్ప అలవాటులా అనిపించింది.

x x x

నాకు "స్పర్శ్" సినిమా జ్ఞాపకమొచ్చింది.....

అందులో హీరో (నసీరుద్దీన్‌షా) గుడ్డివాడు. అతడి స్నేహితురాలు (షబానా ఆజ్మీ) అప్పుడప్పుడు అతని ఇంటికి వొస్తుంటది. కాని, అతను ఏ పనిలోనూ ఆమె సహాయమడుగడు. 'టీ' పెట్టడం దగ్గర్నుండి భోజనం దాంకా తానే తయారు చేసి పెడ్తుంటాడు" అన్నీ పద్ధతిగా జరిగిపోతుంటాయి..." ఎందుకు నన్ను ఏ పనీ చేయనివ్వవు?" అని ఆమె అడిగితే, "నాకు ఎవరి మీద ఆధారపడటం ఇష్టం ఉండదు.. ఎవరైనా నా మీద జాలిపడి నాకు సాయం జేయాలనుకుంటే అది నా ఆత్మ గౌరవానికి భంగం కలిగినట్టు భావిస్తాను" అంటాడతను ఎంతో ఆత్మ విశ్వాసంతో.

అప్పుడు సినిమా జూసి ఉత్తేజితుణ్ణయితే, ఇప్పుడు మనిషిని జూసి ఉత్తేజితుణ్ణయ్యాను.." మనం బయటి వాళ్లతో యుద్ధం జేయడమే గాదు.. మనం మనతో కూడా యుద్ధం జేయాలి" అంటుంటాడు హరగోపాల్‌సారు. జడ్జి గారు ఇతరుల మీద ఆధారపడకుండా ఉండడాన్కి తనలో తాను ఎంతగ



యుద్ధంజేస్తున్నాడో.. అనునిత్యం జారిపోయే మనసును ఒడిసిపట్టడాన్కి చాలా మానసిక బలమేగావాలి మరి.

ప్రతిచిన్నపనికీ ఇతరుల మీద ఆధారపడే నాలాంటి వాడికి అతడు ఆశ్చర్యమనిపిస్తున్నాడు...

ఒక్కనేనేగాదు.. ఆ రోజున పక్షులు, చెట్లు, తీగలు, దూడలు, నీడలు, పగిలినమట్టిరోడ్లూ, కూలిన ఇండ్లు, ఎత్తయిన భవనాలు, చిన్నా - పెద్దా, ముసలీ ముతకా.. ఇలా ఒక్కరేమిటి.. సమస్త మొగిలి గిద్దా.. ఆ మనిషి వైపు సంభ్రమాశ్చర్యాల తేరిపార జూసింది...

తిరుగు ప్రయాణానికి సిద్ధమయ్యాం.. కారు సిద్ధమయ్యింది...

"ఇక్కడేదయినా ముస్లింవీధిగాని మురికివాడ గాని ఉందా?" అని అడిగింది సుల్తానాబేగం.

"ఉంది మేడం.. ఇక్కడ ముస్లింవీధి (తుర్కగేరి) సపరేట్‌గా ఉంది మేడమ్.." అన్నారెవరో...

"అయితే కారు అట్నుంచిపోనీయండి" అందామె ప్రశాంతంగా...

సందులు గొందులు దాటి కారు "తుర్కగేరి" దగ్గర ఆగింది.. ఒకకారు తమ గేరిలో ఆగడం అది మొదటిసారేమొ. అదేదో విమానాన్ని చూడ్డానికొచ్చినట్టు పిల్లలు బిలబిలమంటూ బయటికొచ్చేరు.

కొట్టొచ్చినట్టు కనబడే దారిద్ర్యం...

కొందరికిలాగుల్లేవు.. కొందరికి షర్టులు సరిగ్గా లేవు.. వీధికి అడ్డంపడి విర్రవీగుతున్న మురికి కాలువలు.. ఇండ్ల ముందు కట్టేసిన మేకలు.. గత్తువాసన.. ముసలితనమూ, బీదరికమూ కల్సిదాడిజేస్తోంటే చిక్కి శిథిలమవుతోన్న శరీరాలు.. అక్కడక్కడా పిచ్చాపాటి మాట్లాడుకుంటున్న యువకులు..

ఈ నిరుపేదల్ని చూడటాన్కి ఓ జడ్జిగారు, అతని భార్య వొచ్చారన్నది వాళ్లు నమ్మలేని నిజం.. అక్కడికి ఎవరయినా లీడర్‌సాబ్‌లు వొచ్చారో, లేదో...

అందరూ ఆమె చుట్టూ గుమిగూడారు.. ఆమె ఓ చిన్న పాపను ఎత్తుకొని ముద్దాడింది. కొందరు చిన్న పిల్లలు, ఆమె చేయిని అపురూపంగా పట్టుకొని తెగ సంబరపడిపోతున్నారు. ఎవరో విక్టోరియా రాణి గారు తమ ఇండ్ల మధ్యకు వొచ్చినట్టుగా ఫీలవుతున్నారు వాళ్లు.. ఆమె పిల్లలందరికీ చాక్లెట్లు పంచి పెట్టింది.

వెళ్లిపోబోతుంటే తుర్కగేరి మొత్తం చేతిలెత్తి నమస్కరించినట్టనిపించింది...

x x x

ఆమె ఇక్కడికెందు కొచ్చిందో మాకర్థంగాలేదు.. బహుశా తన భర్త మూలాలు చూడటాన్కి వొచ్చిందేమొ.. ప్రాంతాలు, భాషలు వేరుగావొచ్చు.. రూపాలు వేరయినా, సారమొక్కటే గదా.

"చూశారా మేడమ్.. ఎంతటి దారిద్ర్యం తాండవిస్తోందో.. ఇట్లాంటివాళ్లు తమ బతుకుకోసం రేపు నేరస్తులుగా మారితే ఎట్లా?" అన్నాడొకాయన ఒక గొప్ప విషయాన్ని కనిపెట్టినట్టు.

"నో నో డోంట్ సే లైక్ దట్. దే ఆర్ ఫ్యూచర్ యాక్టీవిటిస్ (కాదు.. కాదు.. మీరట్లా అనొద్దు.. వాళ్లే రేపటి ఉద్యమకారులు)" అందామె శాంతంగా నేనేమీ మాట్లాడలేదు..

యూ నో దిస్ జడ్జ్ హేస్ కమ్ ఫ్రమ్ ది స్లమ్స్ ఓన్లీ. ఒన్ నీడ్స్ ఇమ్మేర్సీ కాన్ఫిడెన్స్ టు విన్ ది లైఫ్. (ఈ జడ్జీ గారు మురికివాడలోంచి వొచ్చినవారే... మనం జీవితాన్ని జయించాలంటే గొప్ప ఆత్మవిశ్వాసం ఉండాలి") -అందామె కొనసాగింపుగా

జడ్జిగారి ముఖంలో దరహాసం...

వెనుక ఎర్రబడ్డ ఆకాశం వీడ్కోలు చెబుతుంటే, కారు మలుపు దిరిగి పట్నం బాట పట్టింది...



## జూన్ నెల పురస్కారాలు





| గొంతెండి పోతుంది ! | మాయాబజారు |
| --- | --- |
| కథకు........రూ.700/- | కవితకు....... రూ.500/- |
| రచయిత : బాల సుధాకర్ మౌళి | రచయిత : సిరికి స్వామి నాయుడు |

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**
మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

ఈ నెల నుండి ఎంపికచేసిన వ్యాసాలకు రూ.500/- **కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం** అందజేయబడుతుంది. ఎంపికను బట్టి ఒక వ్యాసానికి గాని లేదా రెండు వ్యాసాలకు కలిపి గాని ఈ నగదు పురస్కారం అందుతుంది.

**- ఎడిటర్**

---

## స్వాతంత్రం

మలయాళమూలం : **పారక్కడవు**

తెలుగు సేత : **ఎల్.ఆర్.స్వామి**

నలభైవ స్వాతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకుని "టౌన్ హాలు"లో ప్రసంగిస్తున్నాడు నాయకుడు. అతని అనుచరులు చెవులు అప్పగించి వింటున్నారు.

హఠాత్తుగా ఒక ముసలివాడు అక్కడ ప్రత్యక్షమైనాడు
అతడు బోసినవ్వు నవ్వలేదు
చేతి కర్ర పైకెత్తి అర్థనగ్నుడైన అతడు వేదికవైపు పరిగెత్తాడు
ఉపన్యాసం ఆపి వెంటనే వేదిక దిగాడు నాయకుడు.
అతడూ అతని అనుచరులూ కలిసి ముసలివాడ్ని ఆపారు
"ఆగక్కడ" అతని మీదపడ్డారు వాళ్ళు
అతని చేతికర్ర లాగేసుకున్నాడు ఒకడు.
మరొక్కడు అతని కళ్ళద్దాలు తీసేశాడు
అతని నోరు మూయించారు కొందరు-
మరి కొందరు అతన్ని భుజం మీద మోస్తూ బయటికి నడిచారు.
నాయకుడి పెదవులపై చిరునవ్వు పూసింది.
పార్కు చేరుకున్నారు. వాళ్ళు- అక్కడ గుమిగూడిన వాళ్ళు "భారత మాత వర్ధిల్లాలి" అని నినాదాలు చేశారు.
ఒక రాతి మండపంలో ముసలివాడ్ని ప్రతిష్ఠించారు, దండలు వేసారు.
వేసిన దండల తాలూక బరువు వల్ల కావచ్చు లేకపోతే స్వాతంత్రం తాలూకు బరువు వల్ల కావచ్చు
అతడు అప్పటి నుండి తలయెత్తలేదు.



# ఆశారాజు కవితలో ఆకాశదీపాలు...!

డా॥ సోమసుందర్ ఆవంత్స
9347848905




ఆశారాజు నిరంతర సాహితీవ్రతుడు. ఏదో ఒక ఉద్యోగం పొట్ట సమస్య తీర్చడానికి చేసినా, మెదడులో రేగే కలవరాలను అదుపు చేసేది కవిత్వం అని తెలుసుకున్నవాడు. కవిత్వపు ఆసరాతో సకల ఆత్మిక దుఃఖాలనూ తరిమివేసేవాడు ఎప్పుడూ నవ్వుతూ, నలుగురినీ నవ్వించడం కోసం బ్రతుకుతాడు. ఇప్పటికే 14 కవితా సంపుటాలు అచ్చువేసినట్లు జ్ఞాపకం.

నా చేతిలో నిరీక్షిస్తున్న పుస్తకం "ఇప్పుడు" నా మటుకు నాకు ఇప్పుడూ అప్పుడూ ఇలాంటి చప్పుడు మాటలు కవిత్వ శీర్షికగా ఎంత మాత్రమూ అర్థమైనవి కావనే నా ఉద్దేశం! మాతరం, హైస్కూల్లో ఉన్నప్పుడు భమిడిపాటి కామేశ్వరరావు హాస్యస్ఫోరకంగా, "అప్పుడు ఇప్పుడు" అనే నాటకాలు రాశారు. మేం వేస్తున్న నాటకాల పేరు తెలుసుకున్న సోదరులు ముఖాలు కోతి మార్కులా పెట్టి అదేం పేరు? అనేవారు. అంతకంటే హాస్యంగా నాటకానికి వచ్చి చూడండి ! అదేం పేరో మీకే తెలుస్తుంది ! టిక్కెట్టు లేదు ! కనుక మీరు హాయిగా రావచ్చు ! అని మేం వేళాకోళం చేసేవాళ్ళం !

కవిత్వానికి ఉదాత్తమయిన కావ్యనామం మూడొంతుల పని విజయవంతంగా చేస్తుంది. కనక, ఇప్పటికయినా, ఈ మొనగాడబ్బాయి ఇలాంటి దిగుదావి పేర్లుమాని, కాస్త కావ్యనామంగా చకితమై చలనం కలిగించేది పెట్టాలని ఆశిస్తున్నాను. !

సరే ఈ కావ్యంతో సరిపెట్టుకుందుకు నా సమీక్ష రాయాలి కదా ! వెయ్యిమందిలో తనను వేర్పరచుకుందుకు గాను వట్టి గడ్డి బండి శిరోజాలు పెంచుకుంటాడు. చేస్తున్నది మంచి ఉద్యోగమే ! అలా అని ఉద్యోగపు దర్జా చలాయించడు. ఏవో తపన్లు, ఆర్తి, ఆశయాలూ దప్పీ ఉన్న యువకుడు శాంతీ స్థిమితమూ దగ్గరకు రానివ్వడు. అందరినీ చూసి హాయిగా నవ్వగలడు. కనుకనే ఇలా అంటున్నాడు.

నాలుగు నిమిషాల సీనులోనే అసహ్యకరమైన భంగిమలో బయటపడ్డావు. దొంగ విప్లవకారుల్నీ, దగా కోరు కార్మిక బంధువుల్ని రోడ్డు మీద కీడ్వగలడు. కవిత్వానికి అంతకు ముందుండే పవిత్ర భాషా భాండారాన్ని మధుర భాషాలాలిత్యాలను రచ్చకీడ్చగలడు. నగరాల్లో సంచరించే ఆశ పట్టుకోగలడు. "ఈకల్లేని బోడిగుండును గీసిన అగ్గిపుల్లతో గోక్కుంటూ, భయకంరంగా, ఇకిలించావు కదరా!" అంటాడు. ఆ ఇకిలించిన పాత్ర ఎంత అసహ్యకరమో, ఎంత సర్వజన ద్వేష కారకమో, చెప్పడానికి సముచిత భాష వాడక తప్పదు మరి ! వాడే ఇన్నాళ్ళూ విప్లవం వర్థిల్లాలి. అనే గావు కేకలు వేస్తూ, బతికిన నాడే ఒకనాడు రహస్యంగా విప్లవం వస్తుందంటావా ! మార్క్సిజం బ్రతికుందా అని వెటకారంగా చూశాడు. ఇది ఒక శాంపిల్ చిత్రణ!

**దావానలం :** ఒకానొక రాత్రి బేగం అక్తర్ గజల్స్ వింటూ స్పృహ తప్పిన రాత్రి దాని ఉనికేమిటో ఉసురు ఏమిటో తెలుసుకోవడం సాధ్యం కానంతగా ఉక్కిరిబిక్కిరిలో కవిత్వమూ గానమూ, కలిగించవలసిన ప్రమర్థతను అనుభవించాక ఇది రాత్రా పిల్ల నాగు బాము ! సునీధి చౌహాన్‌బుసా ? అన్న ప్రశ్నలలో ఊగిసలాడుతున్న అంతర్ బహిర్ దావానలాల ఉష్ణోగ్రతలు అనుభవించిన కవి వాక్యాలను గమ్మత్తుగా విభజిసాడు !

బద్నాం షాయరీ అనే కవితలో "గాయపడిన వాళ్ళకు లేపనం రాశానే తప్ప, సోమరి గాళ్ళకు జోలపాట పాడలేదు." అని లిఖించిన ఈ కవితతో కవిగా తన సార్థకతను చాటుకుంటున్నాడు. కనక ఎవరూ ఏడవవలసిన అవసరం లేదని హెచ్చరిస్తున్నాడు !

నా ముఖమేకనిపించదు, "కాలికి దెబ్బ తగిలినప్పుడు దారి పొడుగునా రక్తం కారుతుంటే- చేతిరుమాలు తీసి, ప్రేమగా, కట్టుకట్టుకుంటాను. ఈ ముళ్ళ కంప మధ్యన సమయమే దొరకదు!" అంటూ ముక్కోణపు కవిత విశిష్టంగా రచించాడు. ఇతని కంఠధ్వని ఇతనిదే తప్ప అన్యుల గాత్రాలు నేపథ్యం నుంచి వెలువడవు ! కానీ ఈ కవిత చదువుతూంటే ఒక దేశి కవిత జ్ఞాపకం వస్తుంది. అది విచిత్రమయిన తాత్వికగీతం.

**ఉదా :** తవ్వించిరి మూడు చెరువులట అందు రెండే రెండు నిండే నిండవు ! ఒకటీ ఒకటి ఎండే ఎండదు. నిండని ఎండని చెరువుల కిందకి వచ్చిరి ముగ్గురు. రైతులట. అంటూ తమాషాగా సాగుతుంది.

**షాయర్ సాబ్ :** ఎవరిని ఏమనుకున్నా ఎన్ని రహస్యాలు ప్రచారం చేసుకున్నా ఆ ముద్దాయి తెగించి రండి -నా ఇష్టం వచ్చినట్టు చేస్తాను. ఏం చేస్తారో చేయండి. అంటూ సవాలు వదిలి నిర్భయంగా నించుంటే అరిచే వాళ్ళంతా, తోకలు ముడుస్తారు. అది ఈ లోకంతీరి ! ఈ కవి తన అనుభవం నుంచి, చెబుతున్నాడు.

మాయ అనే గీతంలో నిజంగా మాయ క్రమ్మినపుడు, ఎలాంటి అనుభూతులు పొందుతాడో పట్టి పట్టి వర్ణించాడు ఆశారాజు. ఈ గీతంలో మాత్రం భౌతిక, వాస్తవికవాదిగా, చక్కని అనుభవ చిత్రాలు

గుప్పించాడు! దుఃఖాల నుంచి ఆశాగానాలు చేస్తాడు కానీ, ఆకాశరాజుగా శూన్యగానం చేయడు. మొదటి పద చిత్రమే భయంకరమైనది ! సరిగ్గా రాత్రి 11 గంటలకి అతని గుండెల్లో ఖంజరుదింపి, (ఇది మాండలీక పదం అవ్వచ్చు) బహుశా గుండెల్లోకి దించడం కనుక, బాకు అనే అర్థం కావచ్చు ! కుబుసం విడిచిన పడుచుపాము చాలా తీక్షణంగా మరింత భయంకరంగా ఉంటుంది. పడగ మీద దీపం పదునులా, ఆకాశాన్ని ముక్కలుగా కోస్తుంది. భయంకరంగా జూలు దులిపి ఎగరవేస్తుంది. ఇంత బీభత్సపు క్రీడ జరిపింది ఎవరంటే చౌహాన్ ఆపాట టి.విలో వస్తోంటే అది మానసిక ఫలితాన్నే చూపగలదు. కానీ శారీరక ప్రతిక్రియలు చేయలేవు.

ఏక కాలంలో భిన్న భిన్న స్వరూపాలు వచ్చి శ్రోతలను అంత మంత్ర ముగ్ధుల్ని చేయలేకపోవచ్చు ! అది కలిగించే అనుభూతులు వ్యక్తి గతమే కావచ్చు ! వ్యక్తిగత అనుభూతులనే సామాజిక అనుభూతులుగా చిత్రించి, మనకి ఇస్తాడు. ఆ చిత్రణలో కవి ఆశించిన బీభత్సం ఉందా ? లేదా ? అవీ మనకు సమాధానం తోచవలసిన ప్రశ్నలు. సంతృప్తి కలిగిస్తున్న జవాబులు అందించిన ఈ కవి ధన్యుడైనట్లే మనం ఆ పాటవిని, కవి అనుభూతులను సగమైనా, పంచుకోలేకపోవచ్చు ! చౌహాన్ ఎవరో మనకు తెలియకపోవచ్చు ! కాని అవి పద చిత్రాలుగా మార్చి మన సర్వస్వాన్నీ ముంచెత్తి, ఇదమిద్ధంగా ఏదో తేల్చుకోలేని, అనుభవ పరిపాకం కలుగుతుంది. అలా కలిగింది కనుకనే, ఈ కవిత గురించి ఆశారాజు గురించీ చెప్పుకోవలసిన అవసరం లేకపోయింది.

**గరీబ్‌షాయర్ :** ఇది ఒక పేద కవి నిర్భాగ్యపుటావేదన తలవని తలంపుగా ఆపేద కొంపపై అంతకంటె పేద వాళ్ళైన దొంగలు వచ్చిపడ్డారు. భీతావహంగా ప్రత్యక్షమయ్యారు. వాళ్ళు ఇల్లంతా గాలిస్తున్నారు. అప్పుడు కవి అతి సాహసమైన కంఠధ్వనితో ఆ దొంగలను హెచ్చరిస్తున్నాడు. ఇల్లంతా వెదుక్కోమంటాడు తలగడలు చింపమంటాడు... బాత్రూం తలుపులు బద్దల గొట్టమంటాడు. అతనికేం, ఏమైనా చెయ్యమంటాడు. ఇంట్లో ఏముంది? కవిత్వపు ఖజానా ఉంది ! చిత్తు కాగితాలుగా పడి ఉంది. అది ఆది అంతమూ తెలియని అనంతరాశి ! అందులో దూరి, వాడు చచ్చేదాకా వెదికినా, ఒక్క దమ్మిడీ అయినా దొరకదు. ఎంతో విలువైన కవిత్వం దొరుకుతుంది. అది వాళ్ళకు అర్థం కాదు. అవసరం లేదు. ఈ కవిత ద్వారా కవి రెండు పార్శ్వాలను ప్రదర్శించాడు. ఒక పార్శ్వం కవి నిత్యజీవితం. వేరొక పార్శ్వం దొంగలముఠా అబగా వెతుక్కోవాలి. ఏకవాక్యం ద్వ్యర్థికిరి అంటే ఇదే !

వన్నెల సముద్రం - ఆశారాజు నిరంతర కవితాయాతన సాగిస్తూంటే ఎందరో సహృదయులు హర్షధ్వానాలు చేశారు. అభినందన చంపకాలు, అందించారు ! అలాంటివారిలో సౌభాగ్య ఒకరు. అతను అందించిన అభినందనకు కృతజ్ఞతా పూర్వకంగా ఈ గీతాన్ని సంధించాడు. కవిని, విమర్శకుడు హృదయ పూర్వకంగా, అభినందించాడు ! కాని, కవి పొంగిపోలేదు. దిష్టి తగలకుండా, కాళ్ళకు రాసిన మసిగానే భావించాడు. విమర్శకుని సహృదీయత కవికి మాతృస్పర్శగా తోచింది. అది విశేషమే ! అందుకే ఈ కవిత రూపొందింది !

**జఖ్మీషాయర్ :** ఒక కవి రాసిన వాక్యాలు వేడి వేడిగా రవ్వలెగజిమ్ముతూ, కాలే కడ్డీలా ఉంటాయో చెప్పుకోవలసిన వాడు విమర్శకుడు ! కాని ఇక్కడ కవే రూపాంతరం చెంది, ఇలా చెబుతున్నాడు ! వాళ్ళు వదరుబోతులు. నోటికి వచ్చినట్టు మాట్లాడుకోనీయండంటూ చాలా చాలా చెప్పాడు ! నిజానికి కవిత్వపు బాగోగులు గురించి చెప్పేవాళ్ళు అందరున్నారా ? నిజంగా అందరుంటే కవులు నేలమీద నడుద్దురా ? సందేహమే!

**పరిమళం :** కవి పరిమళం దగ్గర కొచ్చాడు, కనక పదిలంగా పదవ కవిత పరిశీలించి, కవి హృదయాన్ని సురభిళపవన తరంగంగా భావిద్దాం. అది వేరు చేయక తప్పదు కదా ! "జాగ్రత్తగా తలుపు తెరిచి చూస్తే లోపల ఇంద్రధనుస్సు నిద్రపోతోంది. ఆ ఇంద్రధనుస్సు బొట్టుబిళ్ళ అంటించుకుని వేరొక బొట్టుబిళ్ళ అద్దం మీదే మర్చిపోయింది. సొమ్మసిల్లిన సౌందర్యంలా నిద్రపోతోంది. కనుక తలుపు జాగ్రత్తగా తెరవకతప్పదు. ఏ మాత్రం అలికిడి చేసినా, తలుపుల కఠోర శబ్దానికి నిద్రలో ఉలిక్కిపడి, ఆమె గుండెల మీద చెయ్యి జారిపోవచ్చు ! బుగ్గమీద నవ్వుజారిపోవచ్చు ! ఏ మాత్రం సవ్వడి చేయక, ఆ నిద్రా సౌందర్యాన్ని భద్రంగా పరిశీలించి, ఒక సౌదామిని సౌందర్యాన్ని అనుభవించమని కవి సలహా ఇస్తున్నాడు ! పది కవితల తర్వాత ఇది మంచి కవితగా అందించాడు. ఇది పదిలమైన ప్రశాంత మందిరం ! ఇక్కడ ఆగి తేరిపార చూస్తూ, ఆశారాజు కవితా రంగంలో చేస్తున్న ఇంద్రజాలం మనం పోల్చుకోవచ్చు ! అతనిది అందరి నోళ్ళో పడ్డ అలవాటయిన కవిత్వం కాదు ! సమాసాల మెహర్బానితో... భూ కంపాలు కలిగించే అశని పాతాలూ కావు ! అతని కవిత్వం, చాంపేయమాలగా దర్శనమిస్తుంది. !

1930లలో శ్రీశ్రీ ఆధునిక కవితా కవులకు భగీరథుని తెలుగు నేలపై దింపిన తర్వాత, ఒక ప్రాణవంతమైన శైలి, తెలుగు కవిత్వానికి ప్రాదిపదికగా నిలిచింది. ఆధునిక కవులు తమ, తమ నైపుణ్యాలతో ఆధునిక భాషకు వైయక్తిక శైలినీ భూషణాలనూ అలంకరించారు. ఇతర కవుల గురించి చర్చించడం ప్రస్తుతం మన పని కాదని, ఆశారాజు కవిత్వ శైలిని విశ్లేషించుకున్నాడు! అనేక చారిత్రక కారణాల వల్ల తెలుగుదేశంలో అంతర్భాగమైన తెలంగాణా భాష వేరుపడి వ్యావహారిక ఉర్దూతో కలిసి, ఒక విచిత్రమైన యాస హైదరాబాదుకు ప్రత్యేకమైన భాషగా ప్రవర్థిల్లింది. ఆ భాషనే ప్రాతిపదికగా, తీసుకుని, హైదరాబాద్ నగరంలో ఏ గుంపు దగ్గరగా చదివినా హర్షధ్వానాలు పెల్లుబికే రీతిగా అతని కవితా శైలిని, మలుచుకున్నాడు. ఆ శైలిని ఆశారాజుదే, సొంత ఖజానా !

ఆశారాజు ఇప్పుడు అనే ఈ కవితా సంపుటిలో మొత్తం 77 కవితలున్నాయి. గ్రంథం భారీగా ఉంది ! కానీ ఆ కవితల్లో షాయర్ జీవితం గురించి వన్నెల నముద్రాలున్నాయి. నవ్వే ముద్దబంతులున్నాయి. ఈపుస్తకంలోని మొదటి 24 కవితలకూ సమావేశాలని, 37 కవితల వరకూ సంబంధాలు అనీ 64 కవితల వరకూ సంఘర్షణ సన్నివేశాలు అని 77 కవితల వరకూ సందర్భాలు అనే నాలుగు అంతర్భాగాలు వింగడించి కవి కవిత్వమా నీకు మొక్కుతాను... అనేశాడు. కవిత్వం ఈ భూలోకం కన్న నిరవధికం ! కనక ఆ నిస్సహాయత తప్పులేదు !

ఆశారాజు కవిత్వంలో బీభత్స రస ప్రధాన సౌందర్య భూమికలు సామన్యంగా ఎదురవుతాయి ! వాటన్నింటికీ ఆహ్వానం అందిస్తూ ! ఆనందం కలిగిస్తున్నాడు !



## చెమట బతుకు

మహ్మద్ ఖాజామైనద్దీన్
9395626276

శ్రమ జీవిది మట్టి బతుకు
చెమట ప్రవహించే బతుకు
కూటికోసం వలసలు
కూడు దొరకక తిప్పలు
రెక్కాడినా డొక్కనిండని స్థితి
ఆకలి తీరుస్తారనుకున్న దేవుళ్ళు
తనగోడు పట్టించుకోని పరిస్థితి
బతుకు తెరువుకోసం
పల్లె నుండి పట్నానికి చేరుకున్న శ్రమజీవి
బతుకు పాట పాడాల్సిందే
సూర్య చంద్రకాంతుల్లో
చెమట ప్రవాహమై పారినా
బతుకు ఎడారే
యజమాని సంపద లాకర్లలోఉన్నా
అద్దాల బీరువాల్లో బంధించబడిఉన్నా
అంతా శ్రామికునిదే
అయినా అతనిది ఆకలి చావే
వెలుగు చీకట్లు బతుకుదెరువులో
వెలుగు బతుకు కోసం
కాలంతోపాటు పయనిస్తూ
బతుకు భారమైనా బాధపడకుండా
శ్రమజీవులంతా సంఘటితమై
హక్కుల కోసం,
దోపిడి యజమానిపై విజయం కోసం
ఎర్రబాటలో సాగాలి
పెట్టుబడిదారీ విధానంలో
బతుకు చిరునామాలేక
ఛిద్రమై పోనీయకుండా
చెమటశక్తిని చాటుతూ
సమాజాన్ని మార్చుకొనాలి
అప్పుడే మట్టి బతుకు
మకుటాయ మానమవుతుంది



---

## మోసం చేశావు

- తోకల రాజేశం,
9676761415

ఎంత పని చేశావు రహదారీ !
నువ్వు నా పల్లె గుండెల మీదికి నడిచొస్తుంటే
అమ్మమ్మ మా యింటికి వస్తున్నంతగా సంతోషపడ్డాను
నల్లని తాచుపామువని ఊహించనేలేదు

నువ్వు పట్నం నుంచి బయలు దేరితే
నీ వీపు మీద అభివృద్ధి వృక్షాలు మొలుస్తాయనుకున్న
ఆ అభివృద్ధి ఉరితాళ్లు విసురుతుందనుకోలేదు

నువ్వు నా యింటి ముందు నుంచి పరుగెత్తుతుంటే
మా యింటి పక్కనే నిల్చున్న నీడల చెట్టులా భావించేవాణ్ణి
కాళ్ల కింది పరికి కంపవైతావనుకోలేదు

నీ నల్లని దేహం మీద పాదం మోపితే
పొలం గట్ల మీద నడుస్తున్న పచ్చని అనుభూతి పొందే వాణ్ణి
పల్లె సౌందర్యాన్ని స్మశానీకరిస్తావనుకోలేదు



నువ్వెంత మోసం చేశావు తారు రోడ్డా !
నువ్వు ఆధునికతను దిగుమతి చేస్తున్నావనుకున్నా
మడుగులోని చేపపిల్లలను కొంగలు కరుచుకుపోయినట్లు
మా సంస్కృతిని మానుంచి ఎత్తుకుపోతావనుకోలేదు

నువ్వు సకల సౌకర్యాలను నా వాకిట్లో దించుతున్నావనుకున్నా
గొర్రెపిల్లను తోడేలెత్తుకపోయినట్లు
నాపల్లె శరీరాన్నే ప్రపంచ మార్కెట్లో తాకట్టు పెడతావనుకోలేదు
నువ్వు వచ్చి మా గడప గడపకూ
నవ్వుల పూల తోరణాలు కడుతావనుకున్నాను
గడపనే రెండు ముక్కలు చేస్తావని ఊహించనే లేదు.

# కవితానాళిక - కలకత్తా !

- డాక్టర్ రాధేయ
9985171411



వ్యక్తీకరించిన ఏ అనుభవమూ, అనుభూతీ సబ్జెక్టివ్‌గా వుండిపోదు. బలమైన అభివ్యక్తి కవి స్వీయానుభవాన్ని మన సుప్తచేతనలోకి ప్రవహింపచేస్తుంది. అందుకే కవిత్వం అర్థంకావడం అంటూ ఉండదు. అనుభవైకవేద్యం అవుతుంది. శక్తివంతమైన పదచిత్రాలు, సంకేతాలు అనుభూతికి రెక్కలుగా అమరుతాయి !

-డా॥ తల్లావఝ్ఝ పంతంజలి శాస్త్రి

కవిత్వం రాయడమనేది నా దృష్టిలో చెప్పాలంటే అది ఉత్తమ వ్యసనమే అవుతుంది. నిరంతరం కవిత్వాన్ని స్వప్నించడమే వ్యసనం. కవిత్వం జీవలక్షణం బలమైన భావోద్వేగాలను నియంత్రించలేం. ప్రశాంతంగా కూర్చోలేం.

ఆధునిక కవులలో అస్తిత్వ స్పృహ విస్తృతమైంది. కవిత్వమంటే బాధ్యతగా, వస్తు వైవిధ్యంతో, కొత్త అభివ్యక్తితో రాస్తున్న కవుల సంఖ్య ఇటీవల పెరిగింది. శిల్పం విషయంలో ఇంకా పరిణతి సాధించవలసివుంది. ఇంకా అధ్యయనం పెరగవలసివుంది. దీర్ఘ కావ్యాల సంఖ్య కూడా ఇటీవల పెరిగింది. యువత సామాజిక శాస్త్రాల అధ్యయనం పట్ల ఆసక్తి పెంచుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అప్పుడే స్పష్టమైన, సమగ్రమైన సామాజిక దృక్పథం అలవడుతుంది.

ఈ అవగాహన కోసమే శ్రీశ్రీని చదవాలి, తిలక్‌ని చదవాలి. శేషేంద్రని చదవాలి. ఆలూరి బైరాగిని చదవాలి, శివారెడ్డిని చదవాలి. వీరిని చదవగలిగితే ముందుగా కవిత్వమెలా రాయకూడదో తెలుసుకోగల్గుతారు. ఆ తర్వాతనే ఎలా రాయాలో నేర్చుకుంటారు. నవకవనానికి ఏమేం కావాలో శ్రీశ్రీ చెప్పారు. సింధూరం, రక్తచందనమే కాదు.. కలకత్తా కాళిక నాళికను కూడా ప్రస్తావించాడు.

మహోగ్ర కలకత్తాను శ్రీశ్రీయే కాదు ఆధునిక కవులు కూడా ఒడిసి పట్టుకున్నారు. తమదైన శైలిలో కలకత్తా..కోల్‌కటాను వర్ణిస్తున్నారు. వారి కవిత్వాన్ని ఓసారి విశ్లేషించుకుందాం ! వర్షాకాలం వ్యవసాయం పనుల సాయంత్రం వొళ్ళంతా కొంగు కప్పుకున్న మా అమ్మలాగ, అమ్మమ్మలాగా ఉంది. కేవలం కళ్ళు మాత్రం కనపడే కాళీఘాట్ కాళీమాత. కంప్యూటర్ ప్రింటర్ నుంచి జారే కాగితాల్లా హౌరా బ్రిడ్జి మీంచి పరుగెత్తే కార్లు అంటూ 'కోల్‌కటా' నగరాన్ని వర్ణిస్తున్నాడీ కవి -

"వివేకవాణి" కన్యాకుమారి దాకా / చికాగో నగరం దాకా ప్రసరించి నట్టు / ఒకరి చిరునామా ఇంకొకరికి తెలీని / పోగుల పోగుల జనాభా / పురికొసలు కట్టి జెండాలంటించినట్టు / కరెంటు వైర్ల ట్రాములు / బతుకంతా రోడ్డు మీదే / ధూమపానం పొగమంచు నగరం నిండా / చౌరంఘీలేన్ ఓ విదేశీవీధి / కలకత్తా కోల్ కటాగా మారిన వైనం తర్వాత / కొద్దిగా చూసిన కలకత్తాలో నాకు / చౌరంఘీలేన్ రిక్షాల్లో / ఓ మనిషి కూర్చుంటే / ఓ మనిషి, ఎద్దులాగ లాగడం.../

- ఒబ్బిని

వృద్ధ నారీ స్వాగతంలా హౌరా బ్రిడ్జి ఆప్యాయంగా అందించిన హస్తాలు అనేక నిస్సహాయతల మధ్య దిగులు నక్షత్రంలా కోల్‌కతా హుగ్లీ నది శ్వేత కేశాలలో మరపడవల జడకుచ్చులు మాత్రం మెరుస్తున్నాయి 'రబీంద్రసదన్' వెలుగు కవితా చివుళ్ళని చెట్లకి అందిస్తోంది. ట్రామ్స్, కాళీఘాట్ గతించిన చరిత్రను శిథిల శకలాలుగా చిత్రిస్తున్నాయి అంటున్న ఈ కవి-

"కలకత్తా / ప్రాంతీయ తత్వపు మోజులో 'కోల్‌కత్తా' వయ్యావు గాని / పాత పేరులోని తియ్యదనమే ఓ రసగుల్లా / అక్కడెక్కడో బండరాళ్ళ మీద రెండు మూటల్లా మిగలాలని / వాటి పగుళ్ళ మధ్య పచ్చని రెండు ఆకులుగా చిగురించాలని / ఎందుకంటే ఏం జెప్పను / సాగరంలో కలిసి గుస గుసలాడే నీశ్వేత కేశాల (హుగ్లీనది) నడుగు / కాళీమాత ఎర్రడ నాలుకపైన నేనూ ఒక ఎర్ర చందనపు పూతనే /"

- డా॥ రూప్‌కుమార్ డబ్బీకార్

కలకత్తా నగరం పుట్టి మూడు వందల సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా పెద్ద ఎత్తున వేడుకలు జరిగాయి. ఈ సందర్భంగా

కవిత

## భవితను శ్వాసిస్తున్న బతుకు

- సి.హెచ్. ప్రకాశ్
9346403040



విభిన్న మనస్సుల / మనుషులున్న ధరిత్రిలో
బురుజుల / బుజువులు వెదికే చరిత్రలో
కుతంత్రాల / ఇనుపయంత్రాల / ప్రపంచీకరణ పాదాల క్రింద నలిగిన / మానవ హక్కులు
సామాజిక అసమానతల మీద / అసహనం ప్రకటించడం /
అసహజమేమీ కాదు.
శరీరంలో అణువణువూ / ఒత్తిగిల్లినప్పుడు,
నాడుల్లో స్పందనలు / చెమ్మగిల్లినప్పుడు
నాళాల్లో వేదనా రుధిరం / ఉరకలెత్తినప్పుడు
ఆర్ధ్రత నిండిన కళ్ళ తడి నుండి
కవిత్వం ఉద్భవించి
ఉద్యమాలకు ఊపిరిపోస్తుంది.
బడ బాగ్నులు మండే / గుండెల్లోంచి ఉద్రేకం ఎగిసిపడి
అభ్యుదయం వైపు అడుగులు వేస్తుంది.
పాల విప్లవం
నేల విప్లవం
హరిత విప్లవం
అరుణ విప్లవం
విప్లవాలు ఎన్ని జరిగినా.. అవి
దూరమైన మెతుకు కోసమే
మెరుగైన బతుకు కోసమే.
జానెడు పొట్ట కోసం / జారిపోతున్న విశ్వాసాన్ని
ఊపిరితిత్తుల నిండా నింపుకొని
బతుకును భవితనూ శ్వాసిస్తున్న శ్రామికుని
తనువు ఇంధనమై, ధనమై, పనిసాధనమై
తను వెలుతురు ధనులై చూపిన మార్గం విప్లవం
విప్లవమంటే వికాసం / విప్లవమంటే ప్రకాశం
విప్లవమంటే మార్పు / విప్లవమంటే మార్గం.

---

నవనీతా దేవ్‌సేన్ రాసిన కవిత ఇది. ఈమె నోబెల్ గ్రహీత అమర్త్యసేన్ భార్య. స్వీకరించు నన్ను కలకత్తా అంటూ వేడుకొంటోంది –

"స్వీకరించు నన్ను కలకత్తా / నేను నీ తొలిప్రేమను నీ బాల్యపు నెచ్చెలిని / తప్పిపోయిన నీతల్లిని / చూడు నీ కోసం సముద్రాన్ని తెచ్చాను / రిక్తహస్తాలతో వచ్చాననుకోకు / నా పాలిండ్లు బరువుగా వ్యర్థ క్షీరంతో పొర్లుతున్నాయి / అగాధమైన ఈ ఉప్పునీటిని చూడరాదా / రా ! వచ్చి పరిశీలనగా చూడు / అస్తమిస్తున్న సూర్యుడు / నా కనుబొమ్మలపై మెరిసిపోతూ ఉంటాడు / స్పర్శించు కలకత్తా నన్ను స్పర్శించు / వెన్నలాంటి మెత్తని నా మాంసాన్ని / నిరీక్షిస్తున్న నీ బాహువుల్లోకి స్వీకరించు / ఇక నాకు ఒంటరితనమన్నదే ఉండదు /"

– నవనీతాదేవ్ సేన్

ఈ కవయిత్రి మహోగ్ర కలకత్తాను మనకు పరిచయం చేస్తున్నారు. కష్టజీవుల స్వేదరక్తపు నాసిక కలకత్తా కాళిక నాలుక. ఎటు చూసినా జనం జనం ప్రభంజనం. సియాల్దా, హౌరా ఏవేవో జంక్షన్ల వెంబడి రోడ్ల నిండా ఎటు చూసినా, ఎటు వెళ్ళినా కాస్మో పాలిటన్ కలకత్తా అంటున్న ఈ కవయిత్రి –

"ఇక్కడ నగరం బతుకు ఆశని చూపించి జీవితాన్ని / ఉగ్రంగా నలిపివేస్తుంది / ఇక్కడ నగరం మనుషుల్ని బలంగా ఆకర్షించి / రోడ్లనీడుస్తుంది / హౌరా బ్రిడ్జి, లబ్లీ బ్రిడ్జికు ఏరియల్ వ్యూకాదు / కలకత్తా / బ్రిడ్జిల నంటి పెట్టుకొని నడిచే బతుకు నీడ్చేవేనవేల / గాభరా బాధితుల బారు కలకత్తా / కలకత్తా రవీంద్రుని గీతాంజలి లాంటి ప్రశాంత / ప్రార్థన కాదు / శరత్చంద్రుని సుకుమార నవలా నాయకుడూ కాదు / అందాల పావురాల విభిన్న కళారూప / దీక్షిణేశ్వరాలయం కాదు / బతుకు సమర చర్మం మీద చెమట చుక్క విలువ లేని / పడుపు కాంత కలకత్తా / కష్ట జీవుల స్వేద రక్తపు నాసిక / కలకత్తా నాలుక /"

–డా॥ కె. గీత

ఇదీ కలకత్తా నగర కవిత్వం. కవుల కలాల్లో మెదిలిన మహోగ్ర కలకత్తా. కష్టజీవుల స్వేదంతో తడిసి ముద్దవుతున్న కోల్‌కటా. కాస్మో పాలిటన్ కలకత్తా కడుపు నిండు రక్తాణువుల్లా ఉరకలెత్తేజనం కోల్‌కటా. పేదల బతుకంతా ఇక్కడ రోడ్ల మీదే కనిపిస్తుంది. నిస్సహాయత, నిరాశల మధ్య దిగులు దిగులుగా జన జీవనం. ఒక కవయిత్రి తొలి ప్రేమకు బాల్యనెచ్చెలిగా కలకత్తా. మరొక కవయిత్రికి స్వేద రక్తపు నాసిక ఈ కలకత్తా. ఈ నగరాన్ని దర్శించిన ఈ కవులు, కవయిత్రులూ కవితా వస్తువుగా చేసుకొని విభిన్న కవితలు రాశారు. వారికి అభివందనాలు.

కవిత

# ఇక భారమంతా నీదే



ఇప్పుడిప్పుడే నాకు.... ఏదో మత్తు వీడుతున్న ఓ భావన !
అది గుడ్డులోంచి పిల్ల బయటపడేందుకు... పడుతున్న తపన !
నాలోని ఆలోచనా సంపత్తి... యిన్నాళ్ళుగా నిద్రలోనే పొద్దుగడిపింది !
ఎక్కడిదో ఓ పిలుపు తట్టిలేపి ... మేలు కొలుపు పాడింది !
పిరికితనపు సంకెళ్ళు... తెంచుకునేందుకు... మనసు మొరాయించినా
కళ్ళు తెరిచి యిలోకరీతిని కనమని నా అంతరాత్మ ప్రబోధం !
ఎన్నో ఏళ్ళుగా నాలో గూడు కట్టుకున్న స్వార్థపు శిలాజాన్ని...
మొదలంటా పెరికి... ఆవలకి విసిరేయాలన్న నా నిర్ణయం...
నాలోని మనిషి తనానికి వూపిరిపోస్తూ.. నాకు పునర్జన్మ నిచ్చింది !
నన్ను నేను నిలబెట్టుకుని ... కొడిగట్టిన జ్ఞానదీపాన్ని వుత్తేజపు
చమురు నందించి దేదీప్యమానం చేశాను వెలుగు వాకిట పాదం మోపాను !
వాస్తవాలు కళ్ళకుకట్టి.. నే పోగులేసుకున్న నిబ్బరం అవాక్కయిపోయింది !
ఎక్కడున్నాం మనం ?? మానవ మృగాల నడుమ బిక్కచచ్చి పడివున్నాం !
ఎటు చూచినా పిశాచగణం ! కరాళ నృత్యపు బీభత్సం !
కళ్ళెదుటే అకృత్యాలు జరిగిపోతున్నా... మాటరాని జీవచ్ఛవాల మయ్యాం !
పరుల సొమ్ము కాజేసేందుకు పసివాళ్ళ అపహరణ ! వుసురుతీసి వారికన్నవాళ్ళకు
విధిస్తున్నారు జీవితకాలపు నరకయాతన !
స్మశాన వైరాగ్యంతో పలుకుతున్నాం ఓ సానుభూతి వాక్యం !
ఆ ఒక్కరోజు చేస్తున్నాం... కాసిని కొవ్వొత్తుల ప్రదర్శనం ! ఆపై కథను కంచికి పంపేస్తున్నాం !
నేడు ఎదుగొచ్చిన ఆడపిల్లకే కాదు... అద్దాల బిడ్డకూ లేదు ఏ రక్షణ !
అత్యాచారాల పరంపరలో.. బతుకు గమనం అతలాకుతలం !
ముష్కరులకు లేదు ఏ మాత్రం భయం ! చట్టంలోని లొసుగులు యిస్తున్నాయి వాళ్ళకు అభయం !
ఎవరు సంధించిన బాణమైన.. ఓ అమ్మ గుండెనే చేస్తుంది ఛిద్రం !
ఆ తల్లి గుండెల్లో రగిలే కార్చిచ్చును ఆర్పగలదా ఏ జలం ?
ఓ న్యాయ దేవతా ! త్వరితగతిని తీర్పివ్వలేవమ్మ మన న్యాయ స్థానాలు !
ఎందుకమ్మా యింకా అక్కడ కొలువుంటావు ? కంచిగరుడ సేవ యింకెన్నాళ్ళు చేస్తావు ?
నీ కళ్ళకున్న నల్ల వస్త్రాన్ని విసిరిపారెయ్ ! నేరుగా సంఘటనా స్థలానికి వచ్చేయ్ !
సమవర్తివై నీవే చెయ్యాలమ్మా న్యాయం ! నీ చేతుల్లోనే వుందమ్మా జగతిని శాసించే కాలదండం !
ఒక్కసారి కనవమ్మా ఆ అభాగ్య తల్లుల రక్త కన్నీరు ! నువ్వూ అమ్మవేగా ఆలోచించు !
ఇక యివ్వాలి నీవే తక్షణ తీర్పు ! ఇక ఎవ్వడూ కలనైనా చేయకూడదు ఏ తప్పు !

- కె. ఎ. ఎల్. సత్యవతి
9440210103

వర్తమానం

# అభివృద్ధి పథంలో దూసుకెళ్తున్న సోషల్ నెట్ వర్కింగ్ సైట్లు

పి.వి. లక్ష్మణరావు
9492043837




భావోద్వేగాల సమాహారమే సమాజం. అందులో ఒక్కొక్క వ్యక్తికి ఒకొక్క అభిరుచి, ఒకొక్క మనస్తత్వం. ఒకే అభిరుచులు మరియు ఇష్టాలు కలిగిన ప్రజల మధ్య ఆన్‌లైన్‌లో సాంఘిక సంబంధాలు నిర్మించి వాటిని వృద్ధిచెందేలా పనిచేసే వేదికలనే సోషల్ నెట్ వర్కింగ్ సైట్లు అంటారు. డిజిటల్ ప్రపంచంలో జీవిస్తోన్న నేటి మానవాళి అంతర్జాల (ఇంటర్నెట్) యుగం మొదలయ్యాక ఆరంభంలో కేవలం వెబ్‌సైట్లు చూడటం మెయిల్స్ పంపుకోవడానికే పరిమితమయ్యారు. తాజాగా సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు అన్ని వయసుల వారినీ, అన్ని రంగులవారినీ ఏకతాటిపైకి తీసుకువస్తున్నాయి.

వెబ్ ఆధారిత సోషల్ నెట్‌వర్క్ సేవల ద్వారా ప్రజలు, రాజకీయ, ఆర్థిక మరియు భౌగోళిక సరిహద్దులతో సంబంధం లేకుండా ప్రయోజనాలు పొందవచ్చు. విడిపోయిన మిత్రులను కలుసుకోవటానికి, బంధాలను పెంచుకోవటానికి, అభిప్రాయాలు పంచుకోవటానికి, కబుర్లు చెప్పుకోవటానికి ఇలా ఎవరికి తోచిన భాష్యం వారు సోషల్ నెట్‌వర్కింగ్ సైట్ల గురించి చెబుతుంటారు.

ఇలాంటి ఎన్నెన్నో ప్రయోజనాలతో కూడుకొన్న సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు ఇటీవల ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టిస్తున్నాయి ట్విట్టర్, ఫేస్‌బుక్, లింక్డిన్, మైస్పేస్, యూట్యూబ్ మొదలైనవి దేశాలనే తేడా లేకుండా సమాజాన్ని ప్రభావితం చేస్తున్న తీరు తీవ్రస్థాయిలో ఆశ్చర్యాన్ని కలిగించే విధంగా ఉంది. భారతదేశంలో ట్విట్టర్, (Twitter) ఆర్కుట్ మరియు ఫేస్‌బుక్ ఎక్కువగా వాడుకలో ఉన్నాయి. క్షణాల్లో సమాచారం ప్రపంచానికి తెలియజేయడానికి ఇవి దోహదం చేస్తున్నాయి. కాకపోతే ఈ సోషల్ నెట్‌వర్కింగ్ అనేది కొంతమందికి అందని ద్రాక్ష లాగా మిగిలిపోతున్నది. అలాంటి భావనలను తొలగించే విధంగా తత్సంబంధమైన సమాచారం అందరికీ అందుబాటులో ఉండాలి. ఆ కార్యసాధనలో భాగంగా సోషల్ నెట్ వర్కింగ్ సైట్ల గురించిన మౌలిక విషయాలను అందించడమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

**సోషల్ నెట్‌వర్కుల్లో ప్రస్తుత ధోరణి**

స్నేహం, ఆధ్యాత్మికం, సేవ, ఉద్యమం, వ్యాపారం, అనుభవాలు, అనుభూతులు, అభిప్రాయాలు, అభిమానాలు, ప్రేమలు, ద్వేషాలు, విశ్లేషణలు, వ్యంగ్యాలు, వాదనలు ఇలా సర్వం సోషల్ నెట్‌వర్కింగ్ బాట పట్టాయి. వినోదాల వారధులుగా మొదలైన సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు అందరినీ తమ దారికి మళ్లించు కొంటున్నాయి. సామాన్యులు, సెలబ్రిటీలు అనే తేడా లేకుండా ఆర్థికం, సామాజికం అనే అర్థాలు మరచి ప్రతీ అంశం సోషల్ నెట్‌వర్కింగ్‌తో మిళితమయ్యాయి.

ప్రస్తుతం ప్రపంచ జనాభా ఏడువందల కోట్లు అయితే అందులో 150 కోట్ల మంది నెటిజన్లు ఉన్నారు. వారిలో కనీసం 90 శాతం మంది ట్విటర్, ఫేస్‌బుక్, లింక్డిన్, మైస్పేస్, యూట్యూబ్‌లలో ఖాతాలు కలిగి ఉన్నారు. సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లని సమాజంలోని భిన్నవర్గాలు తమ ఆధునిక అవసరాలకి తగ్గట్టుగా ఉపయోగించుకొంటున్నాయి. ట్రెండ్ సృష్టిస్తూ కొందరు దాన్ని కొనసాగిస్తూ మరి కొందరు ఇలా అందరూ సోషల్ నెట్‌వర్కింగ్ బాట పట్టారు.

ఫేస్‌బుక్ మెంబర్ కావాలి, ఆర్కుట్లో ప్రొఫైల్ అప్డేట్ చేయాలి ట్విట్టర్లో ట్వీట్ పెట్టాలి. ఇంకా ఇంటర్నెట్ ద్వారా పాత ఫ్రెండ్స్ అందరినీ ఒకే ప్లాట్‌ఫాం పైకి తీసుకురావాలి. అందరితో కాంటాక్ట్‌లో ఉండాలి. ప్రతి ఒక్కరికి మెసేజ్ చేయాలి. ప్రపంచంలో ముక్కూ ముఖం తెలియని వారితో ఫ్రెండ్ షిప్ చేయాలి. భూమ్మీద జరిగే ప్రతి గొడవపైనా మన అభిప్రాయం పంచుకోవాలి. ఇలా ఒకసారి ఇంటర్నెట్‌కి అలవాటు పడిన తర్వాత క్రమంగా చేసే పనులివే.

**ఫేస్ బుక్ :** 2004 ఫిబ్రవరిలో సోషల్ నెట్‌వర్కింగ్ సర్వీస్ వెబ్‌సైట్‌గా ఆవిర్భవించిన ఫేస్‌బుక్ ఎనిమిదేళ్లలో సెప్టెంబర్ 2012 కల్లా ఫేస్‌బుక్‌ని వంద కోట్లమంది వినియోగిస్తున్నారు. వారిలో సగం మంది సెల్‌ఫోన్ ద్వారా దీన్ని ఏక్సిస్ చేస్తున్నారు దీని ఉద్దేశం ఏదైనా నేడు దాన్ని అనేక సేవలకోసం ఎవరి స్థాయిలో వారు తోచిన రీతిలో ఉపయోగించుకొంటున్నారు. ఫేస్‌బుక్ ప్రపంచంలోని వేల మైళ్ల దూరంలో ఉన్నవారిని కలుపుతూ చక్కటి సేవని అందిస్తోంది ఫేస్‌బుక్, ఆర్కుట్‌లలో వ్యక్తిగత అకౌంట్ల ద్వారానే కాక కమ్యూనిటీలు, పేజ్‌ల ద్వారా మన అభిప్రాయాలను వేల, లక్షల మంది దరి చేర్చడం చాలా సులభమైంది. వాదనలూ వివాదాలే కాదు, యువతకు కావాల్సిన



హంగులన్నింటినీ ఫేస్‌బుక్ నవంకరాంశంస్తోంది వినోదాన్ని అందించడమే అంతిమ లక్ష్యంగా పనిచేస్తున్న ఫేస్‌బుక్ నిరంతరం రూపాంతరం చెందుతూ సోషల్ మీడియాలో తన ఆధిపత్యాన్ని నిరూపించుకుంటున్నది.

**ఆర్కుట్ :** ఆర్కుట్‌లో కేవలం ఛాటింగే కాకుండా ఫొటోలు, వీడియో ఫైల్స్‌ను సైతం నిక్షిప్తం చేసుకోవచ్చు. వాటిని ఇతరులకు చేరవేయవచ్చు. అంతే కాదండోయ్ గూగుల్ టాక్‌ను ఉపయోగించి స్నేహితులతో మాట్లాడవచ్చు కూడా. ఇంకా మీ స్నేహితులను, బంధువులను, కొలీగ్స్‌ను గ్రూపుల్లాగా సెట్ చేసుకోవచ్చు. కొన్ని కమ్యూనిటీలను కూడా క్రియేట్ చేసుకోవచ్చు. ఇంగ్లీష్‌లోనే కాకుండా ప్రపంచంలోని 48 భాషల్లో ఆర్కుట్ సేవ లందిస్తుంది. ఇందులో మన భారతీయ భాషలైన హిందీ, తెలుగు, తమిళం, ఒరియా, మరాఠీ, మళయాళం, బెంగాలీ, కన్నడ భాషల్లో కూడా ఆర్కుట్‌ను వాడుకోవచ్చు. మీ ఆర్కుట్ హోమ్‌కి వెళ్లి అందులో ఎడమ పక్క పట్టీలో సెట్టింగులులో Display Language ని తెలుగులోకి మారిస్తే ఆర్కుట్ అనుభవం తెలుగులోకి అనువదించదుతుంది.

**ట్విట్టర్ :** మనం ప్రస్తుతం ఏంచేస్తున్నామనే విషయాన్ని మన స్నేహితులకి, చుట్టాలకి బంధువులకి, ఇంకా తెలిసిన వారికి తెలపాలన్న తాపత్రయం తీర్చే ఒక సాధనంలా ట్విట్టర్ని వాడుకోవచ్చు. కానీ దీన్ని కొద్దిగా మార్చుకొని కూడా వాడుకోవచ్చు. ఎలా అంటే, మనకు ఒక సైటో, బ్లాగో ఉందనుకోండి మీరు కొత్త టపా వేసిన ప్రతిసారి అది ట్విటర్‌లో ప్రకటించొచ్చు. ఇంకా ఆలోచించే కొద్దీ ఏదో ఒక ఉపయోగం తడుతూనే ఉంటుంది. మీకు నచ్చిన వార్తల్ని పంచుకోవడానికి, లేటెస్ట్‌గా నెట్‌లో జనాలు దేనికి ఎక్కువ స్పందిస్తున్నారో తెలుసుకోవడానికి, ఇలా రకరకాలుగా ఉపయోగించవచ్చు.

ట్విట్టర్‌లో ప్రాథమికంగా రెండు ప్రధానాంశాలను మనం గుర్తుంచుకోవాలి. అవి, మనం అనుసరించే వారు (Following) మరియు మనల్ని అనుసరించే వారు (Followers) మనం అనుసరించే వారు (Following) ఏవైనా ట్వీట్ (Tweet) చేస్తే మనకు అవి కనిపిస్తాయి. అలాగే మన ట్వీట్లు (Tweets) మనల్ని అనుసరించేవారికి (Followers) కనిపిస్తాయి. ఇక్కడ ఎవరు ఎవరినైనా అనుసరించవచ్చు. ఎవరినైనా అనుసరించాలంటే వారు మీకు ఖచ్చితంగా తెలుసుండాలని లేదు. అలాగే మిమ్మల్ని అనుసరించే వారికి కూడా అది వర్తిస్తుంది ఇవి బాగా గుర్తుంచుకున్న పక్షాన ట్విట్టర్‌లో మన గమనం సాఫీగా సాగుతుంది.

ట్విట్టర్ మొదటిసారి "ప్రత్యక్ష సమయం" సేవలను ప్రారంభించింది. ప్రత్యక్ష సమయ సేవలు అంటే వినియోగదారులు విషయాన్ని అందించాక, అప్పుడు దానిని అప్‌లోడ్ చేస్తున్న సమయంలోనే ప్రసారం చేయబడటం. ఈ భావన టెలివిజన్లో ప్రత్యక్ష ప్రసారాలు పోలినది. మనకు ఇష్టమైన సెలబ్రిటీల ముచ్చట్లు తెలుసుకోవాలంటే ట్విట్టర్ నెట్‌వర్క్‌ను చూడాల్సిందే. ఫాలో ఆన్ కొడితే తాజాగా వారిచ్చే ప్రతి సందేశాన్ని మనం చదవొచ్చు. ఇందులో వినియోగదారులు వారు ఏమి చేస్తున్నారో వారి మనస్సులో ఏముందో, దానిని 140 అక్షరాల పరిమితిలో ప్రపంచానికి తెలియజేయవచ్చు.

**గూగుల్ ప్లస్ :** ఫేస్‌బుక్ ధాటికి గూగుల్ వారి ఆర్కుట్ కనుమరుగయ్యే పరిస్థితుల మధ్య ఇంటర్నెట్ సెర్చింజన్ దిగ్గజం, గూగుల్ సంస్థ ఆన్‌లైన్ సోషల్ నెట్‌వర్కింగ్ సర్వీస్ (సామాజిక గుంపు) గూగుల్ ప్లస్‌ని విడుదల చేసింది. ప్రస్తుతానికి గూగుల్ ప్లస్ మాత్రం నెంబర్ వన్ సోషల్ నెట్ వర్కింగ్‌గా చలామణీ అవుతున్న ఫేస్‌బుక్‌కి మాత్రం గట్టి పోటీనిస్తుందని యూజర్స్ భావిస్తున్నారు. ఇలా సైట్ల మధ్య పోటీ యూజర్లకు అనేక కొత్త కొత్త సేవలను పరిచయం చేస్తోంది రాబోయే రోజుల్లో గూగుల్ ప్లస్ యూజర్స్ మరింతగా పెరిగే అవకాశం ఉన్నట్లు విశ్లేషకుల అంచనా.

**<u>సమాచార విప్లవం సృష్టిస్తున్న సోషల్ నెట్ వర్కింగ్ సైట్లు పలు కోణాలు :</u>**

**<u>విద్యావిషయకంగా :</u>** సోషల్ నెట్‌వర్కుల్ని ఉపాధ్యాయులూ మరియు విద్యార్థులూ, సమాచార సాధనంగా కూడా ఉపయోగిస్తున్నారు. ఎందరో విద్యార్థులు విస్తారమైన సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లను వినియోగిస్తుండడం వలన ఉపాధ్యాయులు మరియు ప్రొఫెసర్లు, తరగతి చర్చలను విస్తరించడం నుండి అభ్యాసాలు, పరీక్షలు మరియు ప్రశ్నావళులను తయారు చేయడం, తరగతి వాతావరణం వెలుపల అభ్యాసాలకు సాయం చేసేందుకు, చాట్ గది చర్చలు మరియు బృందాలు సృష్టించడం చేస్తున్నారు.

సోషల్ నెట్‌వర్కులు, ఉపాధ్యాయులు, తల్లిదండ్రుల మధ్య సంబంధాలను బలపరిచేందుకు కూడా ఉపయోగపడుతున్నాయి. ఈ సైట్ల ద్వారా తల్లిదండ్రులు ప్రశ్నలు అడగడం మరియు ముఖాముఖిగా కలిసే అవసరం లేకుండా వారి ఆలోచనలు వ్యక్తం చేయడం సాధ్యమవుతున్నది.

**స్నేహవారధులుగా....** మనిషి భావోద్వేగాలు ఇప్పుడు ఆన్‌లైన్‌కు ఎక్కాయి. ఈ రచ్చబండ వద్ద కొందరు దేశాన్ని, రాజకీయ నాయకులను, వ్యవస్థను, సినిమాలను, మనుషులను, అమ్మాయిలను, అబ్బాయిలను, క్రికెట్‌ను వేటి వేటినో తిడుతున్నారు. మరికొందరు సరిగ్గా వీటినే తలకెక్కించుకొంటున్నారు. సోషల్ నెట్‌వర్కింగ్ ద్వారా పాత స్నేహితులు కలవడం ఒక ఎత్తయితే మన అభిరుచుల ద్వారా కొత్త స్నేహితులని కలుపుకుంటూ పోవడం ఇంకొక ఎత్తు. అభిప్రాయాలను కచ్చితంగా చెప్పడానికి ఇంతకు మించిన వేదిక ఉండదనేది నేటి యువతరం భావన. ఈ సెల్ఫ్ బ్రాడ్ కాస్టింగ్ మీడియాలో మనం చెప్పిందే వేదం. నచ్చిన వాడు వింటాడు, నచ్చని వాడితో మనకు అనవసరం.

ఇంకొక ముఖ్య విషయం ఏమిటంటే కవులు, రచయితలు, జర్నలిస్టులు, క్రీడాకారులు, ఆఫీసులో కొలీగులు, తెలుగు బ్లాగర్లు ఇలా అందరినీ కలుపుకోవడానికి ఇక్కడ ఆస్కారం ఉంది వీటి ద్వారా సెలెబ్రిటీస్ కూడా తమ అభిమానులని వెంట తిప్పుకోవచ్చు. బ్లాగర్లకి కూడా సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు చాలా బాగా పనికొస్తాయి. ఇంతకు ముందు మన బ్లాగుని కూడలిలో పబ్లిష్ చేసుకునేవాళ్ళం. ఇప్పుడు ఫేస్‌బుక్‌లో, గూగుల్ ప్లస్‌లో, ట్విట్టరులో వేసుకుని మన మిత్రులతో, శ్రేయోభిలాషులతో పంచుకోవడానికి అవకాశం ఉంది. మన బ్లాగు



చదివి కామెంట్‌ని రాసే అభిమానులతో ప్రత్యక్షంగా మాట్లాడుకోవచ్చు.

**సామాజిక బాధ్యతలో మమేకం అవుతూ....:** ఆర్కుట్, ఫేస్‌బుక్, ట్విట్టర్, హై5... సైట్ ఏదైనా కావొచ్చు. సోషల్ నెట్‌వర్క్ సైట్ల రూటు ఇప్పుడు చాలా మారింది. వాస్తవిక సంఘటనలకు సహాయం చేయటానికి కూడా ఇప్పుడు సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లే వేదికగా నిలుస్తున్నాయి. తప్పిపోయిన పిల్లల గురించిన సమాచారమే కాదు, ఆ పన్నులకు సహాయం చేయటానికి ప్రజలను ఆయా విషయాల్లో చైతన్యవంతులుగా చేయటానికీ ఇవి తమ వంతు పాత్ర పోషిస్తున్నాయి. సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లలోని కొత్త కోణం ఇది.

అవినీతిపై పోరాటమైనా, స్త్రీల సమస్యలైనా సమాచారం తెలుసుకోవటానికి సోషల్‌నెట్ వర్కింగ్ సైట్లనే యువత సాధనంగా చేసుకుంటున్నది. సమాచార మార్పిడితో సరికొత్త సామాజిక మార్పు దిశగా సోషల్ నెట్ వర్కింగ్ సైట్లు ప్రజలకు మార్గదర్శనంగా నిలుస్తున్నాయి.

**ప్రభుత్వ, వ్యాపార అనువర్తనాలు :** ఇటీవల సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లని వివిధ ప్రభుత్వ సంస్థలు ఉపయోగిస్తున్నాయి. సోషల్ నెట్‌వర్కింగ్ సాధనాలు ప్రజల అభిప్రాయం తెలుసుకునేందుకు మరియు వారి చర్యలను ప్రజలకు తెలియజేసేందుకు, ప్రభుత్వానికి ఒక సులువైన మరియు త్వరితమైన మార్గంగా ఉపయోగపడతాయి. వ్యాపార ప్రయోజనాల కొరకు సోషల్ నెట్‌వర్కింగ్ ఉపయోగానికి ఒక ఉదాహరణ లింక్డ్ ఇన్.కామ్, ఇది వృత్తి నిపుణులను కలిపే ప్రయత్నం చేస్తుంది. లింక్డ్ ఇన్ 200కు పైగా దేశాల్లో 40 మిలియన్లకు పైగా వినియోగదారులను కలిగి ఉన్నది.

**రాజకీయ నాయకుల ప్రచారాస్త్రంగా..:**

రాజకీయ నాయకులు వారి విధి విధానాలను తెలియ జేయడానికి ప్రభుత్వ పాలన తీరును విశ్లేషించ డానికి ప్రజలకు మరింత చేరువ కావడానికి స్నేహపూర్వక వాతావరణంలో అందరికీ అందుబాటులో ఉండటానికి రాజకీయ నాయకులు సోషల్ నెట్‌వర్క్‌ని ఒక పాచికగా వాడుతున్నారు. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా, ఆస్ట్రేలియా ప్రధాని జూలియా గిల్లార్డ్ గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ మొదలైన ప్రముఖులు సోషల్ నెట్ వర్కింగ్ సైట్ల ద్వారా నెటిజన్లతో సంభాషించడంలో రికార్డ్ సృష్టించారు.

అదే బాటలో ఆంధ్ర రాష్ట్ర ప్రస్తుత ముఖ్యమంత్రి వర్యులైన నల్లారి కిరణ్ కుమార్ రెడ్డి కూడా ఫేస్ బుక్‌లో ప్రజల ప్రశ్నలకు స్పందిస్తూ, సమాధానాలు ఇస్తూ, సందేహాలు ఉంటే తీరుస్తూ, ప్రజల సమస్యలను పరిష్కరించే దిశగా కృషి చేస్తున్నారు. రాష్ట్రంలో విద్యుత్ గిరాకీ సరఫరాల సమాచారం సీఎం కిరణ్‌కి ఎస్.ఎం.ఎస్.ల రూపంలో అందుతుంది. వీటి ఆధారంగానే విద్యుత్‌పై సమీక్షలు నిర్వహిస్తున్నారు. ముఖ్యమైన విషయాలు, వార్తలు, వివిధ శాఖల కీలక సమాచారాన్ని ఎస్.ఎం.ఎస్.ల ద్వారానే తెలుసుకుంటూ ఉంటారు. తన నిర్ణయాలు, స్పందననూ బ్లాక్ బెర్రీ ఫోన్ ద్వారా ఎస్.ఎం.ఎస్.ల తోనే పంపుతుంటారు.

వివిధ రాజకీయ పార్టీలు ఆధునిక పరిజ్ఞానం అండగా కార్యకలాపాలు కొనసాగిస్తున్నాయి. గతంలో ఒకో పార్టీకి ఒకో వెబ్ సైట్ దాంట్లో పార్టీ సిద్ధాంతాలు ఎన్నికల ప్రణాళిక, నేతల పేర్లు, ఫోన్ నంబర్లు ఉండేవి ఇప్పుడంతా రూటు మారింది. ఆన్‌లైన్ వేదికపై నుంచే ప్రచార హోరు, ప్రత్యర్థులపై విమర్శనాస్త్రాలను సంధిస్తున్నాయి. పార్టీ సభ్యత్వ ప్రక్రియకు ప్రజలతో మమేకం అయ్యేందుకు సైతం సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుంటున్నాయి. ల్యాప్ టాప్‌లు, ఐప్యాడ్‌లు, స్మార్ట్ ఫోన్‌ల సాహచర్యంతో నేతలు ముందుకెళుతున్నారు. పార్టీలు ఫేస్‌బుక్, ట్విట్టర్, గూగుల్ ప్లస్, యూట్యూబ్ వంటి సామాజిక అనుబంధ ఆన్‌లైన్ వేదికల్ని విరివిగా ఉపయోగించుకుంటున్నాయి.

ఈ విషయంలో తెదేపా ముందు వరుసలో ఉంది. ఈ పార్టీకి ఐటీ విభాగం సాంకేతిక నిపుణుల విభాగం కూడా ఉన్నాయి. చంద్రబాబుకు ట్విట్టర్‌లో ఖాతా ఉంది. ఆయన్ని 1760 మంది అనుసరిస్తున్నారు నారా లోకేష్ ప్రత్యర్థులపై ట్విట్టర్ అస్త్రాలను సంధిస్తూ సంచలనం సృష్టిస్తున్నారు. పార్టీ విరాళాలు. ఆదాయ వివరాల్ని సైతం లోక్‌సత్తా తన వెబ్‌సైట్‌లో ఉంచుతున్నది. జయప్రకాష్ నారాయణ్ ఇప్పటి వరకు 420 ట్వీట్లు చేశారు. ఆయన్ని ట్విట్టర్‌లో దాదాపు 54,700 మంది అనుసరిస్తున్నారు జన్ లోక్‌పాల్, స్వరాజ్య ఉద్యమం పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యంపై తరచూ ట్విట్టర్ ద్వారా వీడియో ఛాటింగ్ చేస్తున్నారు ఆయన 15 ఏళ్లుగా ల్యాప్ టాప్ వినియోగిస్తున్నారు.

సీపీయం రాష్ట్ర కార్యాలయంలో వైఫై సౌకర్యం ఉన్నది. సీపీయం రాష్ట్ర కార్యదర్శి కమిటీలోని 14 మంది అంతర్జాలాన్ని ఉపయోగిస్తున్నారు దాదాపు సగం మందికి కంప్యూటర్ / ల్యాప్ టాప్ / టాబ్లాయిడ్ పీసీ / ఐ ప్యాడ్‌లలో ఒకటి సొంతది ఉంది. సీపీయం రాష్ట్ర కార్యదర్శి బీవీ రాఘవులును ఎప్పుడు ఎక్కడ చూసినా ఆయన భుజానికి ఓ సంచి కనిపిస్తుంది అందులో తప్పనిసరిగా ఓ ఐప్యాడ్ ఉంటుంది. ప్రపంచ బ్యాంకు నుంచి రాష్ట్ర ప్రభుత్వం ఎప్పుడెంత రుణం తీసుకుంది? విద్యుత్ ఛార్జీలు ఎప్పుడెప్పుడు పెరిగాయి. తదితర వివరాలు అందుకే ఆయన క్షణాల్లో చెప్పేస్తారు.

తెరాస అధినేత కేసీఆర్ ఆధునిక పరిజ్ఞానాన్ని విరివిగా వాడటంలో దిట్ట ఆయన ఇంట్లో ఉన్నా ఢిల్లీకి వెళ్ళినా 3జి సదుపాయం ఫోన్‌తో తన వ్యవసాయ క్షేత్రంలో పంటలసాగుని ఎప్పటికప్పుడు పరిశీలిస్తుంటారు.

భాజపా రాష్ట్ర అధ్యక్షుడు కిషన్ రెడ్డికి సొంత వెబ్‌సైట్‌తో పాటు ఫేస్‌బుక్, ట్విట్టర్ వంటి సామాజిక వెబ్‌సైట్‌లలో ఖాతాలున్నాయి. కిషన్‌రెడ్డి ఇప్పటి వరకు 2,983 ట్వీట్లు చేశారు ఆయన్ని అనుసరించే వారి సంఖ్య దాదాపు 3,926 మంది. ఇకపోతే 2జీ, బొగ్గు కుంభకోణాల నివేదికలు సహా కేంద్ర ప్రభుత్వ కీలకనిర్ణయాల వివరాలు వెంకయ్య నాయుడు చేతిలో ఉన్న ఆధునిక ఫోన్లో క్షణాల్లో ప్రత్యక్షం అవుతాయి తెదేపా, భాజాపా, లోక్‌సత్తా పార్టీలు ఆన్‌లైన్‌లో కూడా పార్టీ సభ్యత్వాన్ని ఇస్తున్నాయి. 70 ఏళ్ళు దాటిన పాటూరు రామయ్య మల్లారెడ్డి తదితర నాయకులు సైతం అంతర్జాలాన్ని వినియోగించటం ఎంతో విశేషం.

**ఉద్యోగాలు ఇప్పిస్తున్న సోషల్ నెట్‌వర్కింగ్ సైట్‌లు :** సోషల్ నెట్ వర్కింగ్ వెబ్ సైట్ల పాత్ర బహుముఖంగా మారుతోంది. ఇవి కేవలం యువత స్నేహానికి ఆలంబనగా నిలబడటం మాత్రమే కాదు వారికి

కొత్త ఉద్యోగావకాశాలను చూపించడంలోనూ ముందంజలో ఉంటున్నాయి. సేవకు రాజమార్గాలుగా రూపుదిద్దుకుంటున్నాయి. “మీ స్నేహితులు ఎలాంటి వారో చెబితే, నీవెలాంటి వాడివో చెబుతా పాత ఇంగ్లీషు సామెతకు అనువాదమిది. ప్రస్తుతం అనేక కంపెనీలు మీ ఫేస్‌బుక్ అకౌంట్ చూసి మీ వ్యక్తిత్వం గురించి అంచనాకు వస్తాం అంటున్నాయి. ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకు వెళ్లిన అభ్యర్థిని ఫేస్‌బుక్ అకౌంట్, పాస్‌వర్డ్ అడిగి అవాక్కయ్యేలా చేస్తున్నాయి అనేక కంపెనీలు.

మీకు ఉద్యోగం కావాలనుకొంటే అకౌంట్ డీటైల్స్ ఇవ్వండి అని క్లియర్‌గా అడుగుతున్న ఉదంతాలు అనేకం వెలుగులోకి వస్తున్నాయి. అభ్యర్థి ఫేస్‌బుక్ అకౌంట్‌లోకి లాగిన్ అయ్యి అతడి వ్యక్తిత్వాన్ని సంపూర్ణ స్థాయిలో అర్థం చేసుకోవచ్చని కార్పొరేట్ కంపెనీలు భావిస్తున్నాయి ఇది డైరెక్ట్ విధానం అయితే మరికొన్ని కంపెనీలు ఫేస్‌బుక్ ద్వారా ఉద్యోగుల వేటని చేస్తున్నాయి. కంపెనీల హెచ్.ఆర్. డిపార్ట్‌మెంట్ వారు మారుపేర్లతో ఫేస్‌బుక్‌లోకి లాగిన్ అయ్యి తమకు నచ్చిన గుణాలున్న వారిని సెలెక్ట్ చేసుకొని ఉద్యోగాలు ఆఫర్ చేస్తున్నాయనే విషయాలు కూడా మీడియాలో వస్తున్నాయి. ఆధారాలతో ఆయా నెట్ వర్కింగ్ సైట్లలో ఒక్కసారి పోస్ట్ చేస్తే చాలు... గంటల వ్యవధిలోనే మీకు అవసరమైన సహాయం అందుతుంది.

**ఆన్‌లైన్‌లో పిల్లల హవా :** ఫేస్ బుక్, ట్విట్టర్ లాంటి సామాజిక అనుసంధాన సైట్ల వాడకం పెరిగినప్పటి నుంచీ నెట్ వాడుతున్న వారి సంఖ్య ఏటా కోట్లలో పెరుగుతున్నది. అయితే ఆన్‌లైన్‌లో ఉంటున్న పిల్లల సంఖ్య అంతకన్నా వేగంగా పెరుగుతోందని ఓ సర్వే తేల్చింది. భారత దేశంలో గత ఏడాది వరకు 4 కోట్ల మంది పిల్లలు నెట్‌ని ఉపయోగిస్తుంటే మరో నాలుగేళ్లలో ఈ సంఖ్య 13.4 కోట్లకు చేరే అవకాశం ఉందని ఒక అధ్యయనంలో వెల్లడైంది. అయితే పిల్లలు నెట్ చూడటంలో నిర్వహించిన మరో అధ్యయనం వాళ్లపై తల్లిదండ్రుల నిఘా అంతగా ఉండటం లేదని తెలిపింది. నెట్ చూసే పిల్లల సంఖ్య పెరుగుతున్న నేపథ్యంలో అనవసర విషయాలని తెలిపే సైట్లు ఓపెన్ కాకుండా చూడాల్సిన బాధ్యత తల్లిదండ్రులదే అని సర్వే నిర్వాహకులు అంటున్నారు.

**ఉద్యమాలకు ప్రచార సాధనంగా సోషల్ మీడియా :**

సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు ఉద్యమాలకు కేరాఫ్ అడ్రస్‌గా కూడా నిలిచాయి. ప్రభుత్వ విధానాలపైనా, నాయకుల మెరిట్స్ డీమెరిట్స్ పైనా ప్రభుత్వ విధానాలు, పాలనపై సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లలో ప్రజల అభిప్రాయాలు వెలుగు చూస్తుండడంతో ప్రభుత్వాలపై ఒత్తిడి పెరుగుతోంది. ఇటీవల మన దేశంలో అన్నా హజారే సాగించిన అవినీతి వ్యతిరేక ఉద్యమంలో కీలకపాత్ర వహించింది సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లే. పెద్దగా చదువుకోని అన్నా ఉద్యమానికి విద్యావంతులంతా అండగా నిలవడానికి దోహదం చేసింది సోషల్ నెట్ వర్కింగ్ సైట్లే. లాడెన్ హతమైన విషయం తొలుత ప్రపంచానికి తెలిసింది సోషల్ నెట్‌వర్కింగ్ సైట్ ద్వారానే. పశ్చిమాసియా దేశాల్లో ఇటీవల పలు విప్లవాలకు కారణం సోషల్ సైట్లే అదే విధంగా అమెరికాలో విడాకులకు సోషల్ సైట్లే ప్రధాన కారణం అవుతున్నట్టు ఇటీవల ఒక సర్వేలో తేలింది. ఫేస్‌బుక్, ఆర్కుట్, గూగుల్ ప్లస్ వంటి ప్రముఖ సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు సమాచార విప్లవం సృష్టిస్తున్నాయి.

**మొబైల్ సోషల్ నెట్‌వర్కింగ్ :** మన దేశంలో ఇప్పుడిప్పుడే స్మార్ట్ ఫోన్లు, ఐపాడ్‌లు, ట్యాబ్లెట్లు విస్తరిస్తున్నాయి. ఇంటర్‌నెట్ ఫోన్ కలిసి పోతున్నాయి. ఈ స్మార్ట్ ఫోన్లలో ఇంటర్‌నెట్‌తో సోషల్ నెట్‌వర్క్‌లను ఉపయోగిస్తున్నారు ఇప్పుడు కొత్తగా వస్తున్న కొన్ని మొబైల్ ఫోన్లలో ఫేస్‌బుక్ బటన్ కూడా ఉందట. బటన్ నొక్కి నేరుగా ఫొటోలు అప్‌లోడ్ చేసుకోవచ్చుట.

ఇంకా ఎన్నో మొబైల్ సమాజాలలో, మొబైల్ ఫోన్ వినియోగదారులు ప్రస్తుతం తమ స్వంత ప్రొఫైల్స్ తయారు చేసుకోవచ్చు. స్నేహాలు మొదలుపెట్టవచ్చు. చాట్ గదుల్లో పాల్గొనవచ్చు. చాట్ గదులను తయారు చేయవచ్చు. వ్యక్తిగత సంభాషణలు నిర్వహించవచ్చు. ఫొటోలు మరియు వీడియోలను పంచుకోవచ్చు. మరియు వారి మొబైల్ ఫోన్ ఉపయోగించి బ్లాగుల్ని పంచుకోవచ్చు. టాబ్లెట్లలో కూడా సోషల్ సైట్లకు వెళ్ళచ్చు, రండి మావి కొనుక్కోండి అని టాబ్లెట్ల మార్కెటింగ్ జోరుకూడా బాగా పెరిగింది అలాగే ఐ-పాడ్లు కూడా.

కాకపోతే ‘అతి సర్వత్ర వర్జయేత్’ అన్నారు. పైన తెలిపిన ప్రయోజనాలను పొందడం కోసమో లేదా ఏదో సరదాగా అందరితో కాంటాక్ట్‌'లో ఉండేందుకు సోషల్ నెట్‘వర్క్ సైట్లు వాడుకుంటే ఫరవాలేదు కానీ అదే లోకమైతే తలనొప్పులు తప్పవు. సోషలైజేషన్ ఆరాటం నెటిజెన్స్‌'లో ఒత్తిడికి కారణమవుతున్నది. ఫేస్ ‘బుక్’లో వివరాలు త్వరగా అప్ ‘డేట్ చేయాలని... మెసేజ్‌లకు చాలా ఫాస్ట్'గా క్రియేటివ్'గా రిప్లై ఇవ్వాలనే ఆత్రుతే ఇందుకు కారణం.

సోషల్ నెట్ వర్కింగ్ వెబ్‌సైట్లు కొందరి పిచ్చి చేష్టలకు కూడా వేదికగా మారుతున్నాయి. ఫలితంగా ప్రాణాలు పోతున్నాయి. తన ప్రియుడు ఫేస్‌బుక్‌లో తమ సంబంధం తెగిపోయిందని ప్రియురాలిని చెత్త కుప్పలో పడేశానని ఫేస్‌బుక్‌లో చాటి చెప్పాడు. దీన్ని అవమానంగా భావించిన ఆ ప్రియురాలు హాస్టల్ గదిలో ఆత్మహత్య చేసుకుంది. దీనిని బట్టి సోషల్ సైట్స్ సమాజంపై చూపుతున్న ప్రభావం తక్కువేమీ కాదనిపిస్తుంది. ఇలా వ్యక్తిగత జీవితాలను చిన్నాభిన్నం చేసిన సంఘటనలు ఈ మధ్య చాలానే వెలుగులోకి వస్తున్నాయి.

అంతేకాకుండా మితిమీరిన అసభ్యకరమైన రాతలు, ఫొటోలు మార్ఫింగ్ కూడా ఈ మధ్య ఎక్కువగా కనిపిస్తోంది ప్రధాన మంత్రితో సహా ఏ స్థాయిలో ఉన్నవారైనా కనీస గౌరవం చూపకుండా అసభ్యకరమైన రాతలు రాస్తున్నారు. పాలన నచ్చకపోతే మర్యాదకరమైన భాషలో చెప్పవచ్చు. తీవ్రంగా విమర్శించవచ్చు. కానీ అసభ్యకరమైన రాతలతో కొంతమంది తమ అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు.

పిల్లలు మరియు టీనేజర్ల ద్వారా సోషల్ నెట్‌వర్క్ సేవల దుర్వినియోగం గురించి ప్రత్యేకంగా ఆన్లైన్ లైంగిక వేటగాళ్ళ విషయంలో, పౌరులు మరియు ప్రభుత్వాలు తీవ్రంగా ఆలోచించడం జరుగుతుంది. ఈ సమస్యను మెరుగ్గా అర్థం చేసుకోవడానికి మరియు పరిష్కారాలు కనుగొనడానికీ, ప్రభుత్వాలు కొన్ని చర్యలు చేపట్టే దిశగా కృషి చేయాల్సి ఉన్నది.



# ప్రేమ సామ్రాజ్యాన్ని నిర్మిద్దాం

- డా॥ కత్తి పద్మారావు
9849741695



నెత్తురు ధారాపాతంగా
రాస్తానిండా ఓడుతునే వుంది.
గుండెలు అవిసిపోయే
ఆర్తనాదాలు,
ఆకాశం పిక్కటిల్లే
అరుపులు
'అమ్మ' అనేలోపే
దేశం వ్రయ్యలు, వ్రయ్యలు.
ఎవరు వీరు ?
దేనికోసం బలి
ప్రతికేక వెనుక
ఒక కుటుంబం శోకసముద్రం
మానవత్వం విధ్వంసం
అవుతున్నపుడంతా
మనస్సుకు తూట్లు...
ఎవరో చేసిన నిర్ణయానికి
ఒక తల్లి అశ్రుధార!
మతాన్ని ఎవరు సృజించారు
మతోన్మాదం
రక్తం మరిగిన పులి.
ఏమతమైన ప్రేమమృగ్యమైనపుడు
అది సృష్టికి విఘాతమే కదా!
రాజ్యం
దేన్ని ఉరివేస్తుంది?
వ్యక్తినా? ఉన్మాద చర్యనా ?
బాబ్రీమసీద్‌ను కూల్చిన వాడికి
దిల్‌షుక్‌నగర్‌లో బాంబు పెట్టిన వాడికి
తేడా ఏమిటి?
ఇద్దరూ ఉన్మాదులే కదా!
మీ దేవుళ్ళందరికి చేతుల్లోని
ఆయుధాలు ముందు తీసివేయండి?
మతమంటే ప్రేమ, కరుణ, ప్రజ్ఞకాదా!
తీవ్రవాదం పునాదు లెక్కడివి?
రాజ్యం, సామ్రాజ్యం
మార్కెట్టు, విస్తరణలకు
ఎవరు మూలం?
మీ హంతక చర్యలకు
మీ దేవుళ్ళను అడ్డుపెడుతున్నారు?
మీరు ఎవర్ని బెదిరించడానికి
ఈ విధ్వంసం చేస్తున్నారు?
చనిపోయినవారిలో
హిందూ, ముస్లిం, క్రైస్తవులు
అందరూ ఉన్నారు కదా!
మతాన్ని, దేవుణ్ణి మానవుడే సృష్టించాడుసుమా!
ఉన్మాదం, ఉద్రేకం
దేన్ని సాధించలేవు!
ఆ చనిపోయిన విద్యార్థి
ఆశాసౌధాన్ని కూల్చే హక్కు
నీకెవ్వరిచ్చారు?
రోడ్డుమీద నిలబడే
స్వేచ్ఛ మీద నీవు వేసిన వేటు
భయన్ని, భయోత్పాతాన్ని
మనిషి ముందు నిలబెడుతున్నాయి కదా!
అందరికంటే
మనిషి గొప్పవాడు
అతన్ని గుర్తించండి
ఒక తల్లి, ఒక చెల్లి,
ఒక అక్క
కన్నీరు మున్నీరైతే
అకాలంగా
శరీరాలు ఛిద్రమైతే,
మనిషి జీవించే హక్కు మీద
గొడ్డలి వేటుపడితే
చివరకు ఏం మిగులుతుంది?!
అవును!
కొందరిది సామ్రాజ్యవాద భావన
'సూఫీవాదం' ఏమిచెబుతుంది
మానవత్వాన్ని ప్రబోధిస్తుంది
మనిషిలోని సున్నితమైన
ఆర్ధ్రభావాలను తట్టిలేపుతుంది.
అక్బర్ ఏమి చెప్పాడు
సమానత్వం, సౌభ్రాతృత్వం
మానవాభ్యుదయానికి
మూలం అన్నాడు
అంబేడ్కర్ చెప్పిన మాట ఒక్కటే
ప్రేమ సామ్రాజ్యంలో
మానవ సబంధాలు చిక్కబడతాయి
జీవించే హక్కును
కాలరాస్తే
జీవన గమనమే స్థంబిస్తుంది
అందుకే,
ఉన్మాదాన్ని నిర్మూలిస్తూ
మానవత్వాన్ని పునరుత్తేజితం చేద్దాం
ఆ దిశగా చేయి చేయి పట్టుకునడుద్దాం.

# చాక్లెట్ అంకుల్



**జంధ్యాల రఘుబాబు**

9849753298

అది కర్నూలులో రద్దీగా ఉండే గౌళిగేరి ప్రాంతం. వాహనాల ధ్వనులూ, పొగ, దుమ్మూ, అన్నీ ఆ ప్రాంతవాసులకు మామూలే. పొద్దున నాలుగు నాలుగున్నర నుండి బొరుగులు అంటే మరమరాలు అమ్ముకునే వాళ్ళు, కొద్దిసేపటికి కూరల వాళ్ళూ, మార్నింగ్ వాక్ వాళ్ళూ, అలా మొదలై రాత్రి సెకండ్ షో నుండి వచ్చే వారితో ముగుస్తుంది. అయినా ఒకటీ అరా ఆటోలు రాత్రి అపుడప్పుడూ వస్తూనే ఉంటాయి. బస్సుల్లో, రైళ్ళలో అర్ధరాత్రి వచ్చేవారు కొందరైతే, అదే ప్రాంతంలో నివాసముండే ఆటో డ్రయివర్లు కొందరున్నారు. మొత్తం మీద ఆ కాలనీ నిద్రపోయేది ఓ రెండు గంటంటుందేమో !

అక్కడే ఓ అపార్టుమెంటు. అందులో ఒకో అంతస్తుకూ నాలుగు ప్రకారం ఫ్లాట్లు. అది కట్టించిన ఇంజనీరు కూడా అందులోనే ఉండటం చేత ఎవ్వరికీ ఏ ఇబ్బందీ లేదు. వాటిల్లో చేరటానికి కుటుంబాలకు మాత్రమే అవకాశం. విద్యార్థులు, ఉద్యోగాలు చేసుకునే ఒంటరి వాళ్ళకు అక్కడ కాలు పెట్టే అవకాశం కానీ, అర్హత కానీ ఉండదు.

అక్కడికి ఒక్కసారి వచ్చిన వాళ్ళు మరి వెనక్కి పోలేరు. అది ఆ అపార్టుమెంటుకో ఆ కాలనీకో పరిమితం కాదు, అది కర్నూలు సహజ లక్షణం. ఎక్కడో రాజమండ్రి ఆవల నుండి, మహారాష్ట్ర, కర్నాటక, తమిళనాడు రాష్ట్రాల నుండి, ఇంకా పక్క జిల్లాల నుండి ఎందరో వస్తారు. ఇక్కడి అభిమానం, ఆదరణ వారిని కట్టి పడేస్తాయి. వారు ఇక్కడ ఒక్కసారి అడుగు పెడితే వందసార్లు పెట్టినట్టే!

ఆ అపార్టుమెంటు ఓ సర్వమత సమ్మేళనంలా ఉంటుంది. అందరినీ కాకున్నా కొందరిని పరిచయం చేసుకుందాం. రెండవ ఫ్లోరులో రాఘవ స్టేట్ బ్యాంకులో పనిచేస్తాడు. ఇద్దరి పిల్లలు. భార్య సుమతి ఇంటి బాధ్యతలు చూస్తుంది. వారికి ఎదురుగా ఇస్మాయిల్. ఎల్ ఐ సీ లో ఉద్యోగం. భార్య నూర్జహాన్ ప్రయివేటు కాలేజీలో ఉద్యోగం. ఒక పాప మున్నీ. నాలుగేళ్ళు. అపార్టుమెంటు కాంప్లెక్సులో ఆ పిల్లే బార్బీ బొమ్మ.

నాలుగో ఫ్లోరులో సింగిల్ బెడ్ రూం ఫ్లాటు ఖాళీ అయింది. విల్సన్ అని "సాంఘిక సంక్షేమ శాఖలో" పని చేస్తాడట. వేరే వూర్లో కుటుంబం, ఒక్కడూ ఇక్కడ ఉంటాడు. మనిషి ఎత్తుగా గడ్డం పెంచుకొని ఉంటాడు. వినయం, హావ భావాలు చూస్తే మంచి కుటుంబం నుండి వచ్చినట్టు తెలిసిపోతుంది. ఏదో లోకంలో ఉన్నట్టుగా ఉంటాడు. తనేమో, తన పనేమో అన్నట్టు ఉంటాడు. చేరి వారమయినా ఎవ్వరినీ తల ఎత్తి కూడా చూడలేదు. ఏదో లోకంలో ఉన్నట్టు వెళుతుంటాడు. మనిషిని చూస్తే మాత్రం ఒకప్పుడు బాగా హుషారుగా ఉన్న వాడని ఇట్టే తెలిసిపోతుంది.

బిల్డర్ ఆయనకి ఫ్లాట్ ఇవ్వటం ఎవ్వరికీ నచ్చలేదు. ఒంటరి వాళ్ళకు ఇవ్వకూడదన్న నిబంధన తుంగలో తొక్కేశాడని ఆయన్ని కడిగేశారు అందరూ. ఆయన తాను చేసిన పనిని సమర్ధించుకొని ఓ మిత్రుడి బలవంతాన ఇవ్వవలసి వచ్చిందని, తమ ఎదురుగానే ఉండేది కాబట్టి' నేను దేనికైనా జవాబుదారీ" అని సముదాయించాడు. చర్చ అప్పటికి సద్దుమణిగింది.

సాయంత్రం ఏడు గంటలయింది. అందరూ ఎవరి పనుల్లో వారు, ఎవరి సీరియల్లో వారు, ఎవరి కార్టూన్లలో వారు ఉన్నారు. కింద మోటారు సైకిలు శబ్దం. పిల్లలతో ఆడుకుంటున్న మున్నీ బయటకు పరిగెత్తుకొచ్చింది. రాఘవ అంకుల్ బండి శబ్దం ఆ పిల్లకు బాగా తెలుసు. అంకుల్ అని ఎదురుగా పరిగెత్తింది. స్టాండు వేసి, సంచీ భుజాన వేసుకొని, చేతులు చాచి మున్నీ అన్నాడు, ఆ పిల్ల పరిగెత్తుకెళ్ళి అంకుల్ చేతుల్లో వాలిపోయింది. ఆ దృశ్యం చూసిన వాళ్ళకి ఇది ఇప్పుడు జరుగుతోందా లేక "రిప్లే" నా అన్న అనుమానం వస్తుంది. ఎందుకంటే ఇది రోజూ జరిగే వ్యవహారం కాబట్టి.



విల్సన్ పైకి ఎదురుపడ్డాడు. మున్నీని చూశాడు. చిన్నగా నవ్వాడు. ఆ పిల్ల కూడా నవ్వింది. ఇది ఎవ్వరూ గమనించలేదు. రాఘవ మున్నీని ముద్దుగా ఎత్తుకుని పోవటం చూసి ఆప్యాయంగా చూశాడు. తాను ఎత్తుకున్నట్టే వూహించుకున్నాడు.

"తానూ ఏదో ఒక రోజు మున్నీతో ఆడుకోవచ్చు కదా" అనుకున్నాడు.

మరుసటి రోజు నుండీ విల్సన్‌లో మార్పు రాసాగింది. కొంచెం హుషారుగా మారాడు. సాయంకాలం మున్నీకి చాక్లెట్ తీసుకొచ్చాడు. ఆ పిల్ల ఎదురుపడితే ఇవ్వవచ్చునుకున్నాడు. కానీ వీలు పడలేదు. అది అలాగే జేబులో పెట్టుకుని తిరగసాగాడు.

ఓ రోజు రాఘవకు ఎదురుపడ్డాడు. రాఘవనే పలకరించాడు. పరిచయం చేసుకున్నాడు. కొన్ని కుటుంబ కారణాల వల్ల ఇక్కడికి వచ్చానని, ఓ రెండేళ్ళ తరువాత తమ వూరికి వెళతాననీ చెప్పాడు విల్సన్. అంతకన్నా లోతుగా చెప్పనూలేదు, రాఘవ అడగనూ లేదు. అయితే ఏదో అనుకోని సంఘటన జరిగి వుంటుందని మాత్రం రాఘవకు తెలిసిపోయింది.

మరుసటిరోజు మున్నీ ఎదురుపడింది విల్సన్‌కు కళ్ళతోనే పలకరించాడు. కనుబొమ్మలు ఎగరవేసింది. ఏం పేరు అన్నాడు మున్నీ అని చెప్పింది. ఇవ్వాలా వద్దా అనుకుంటూనే చాక్లెట్ ఇవ్వబోయాడు. చేయి చాపింది, ఏమనుకుందో ఏమో గిరిక్కున వెనక్కి వెళ్లిపోయింది. చాక్లెట్ తీసుకోకుండా.

మరుసటిరోజు, ఆ పై రోజు చూశాడు. నవ్వుతుంది.

ఒకరోజు ఉండబట్టలేక "హై మున్నీ" అన్నాడు

"హై అంకుల్" అంది.

ఇది చాల్లే అనుకున్నాడు. హాయ్‌లు చెప్పడం మొదట రోజువారీ కార్యక్రమం చేద్దామనుకున్నాడు.

ఇంతలో శనివారం రావటం, ఊరికి వెళ్ళటం. తిరిగి వచ్చాక పాత విల్సన్ తనను ఆక్రమించటం, ముభావంగా ఉండటం. విల్సన్‌కు తన మీద తనకే జాలి కలిగింది. "ఎందుకు తాను మామూలుగా ఉండలేక పోతున్నాడు" అని లోపల అనుకున్నాడు. మున్నీని చూస్తే మాత్రం ఈ లోకంలోకి వస్తున్నాడు. తనతో ఎలాగైనా మాట్లాడాలి, చాక్లెట్ ఇవ్వాలి, ఎత్తుకోవాలి.

మిగతా పిల్లలు పెద్దగా విల్సన్‌ను చూసింది లేదు, తాను వారితో స్నేహం కోసం ప్రయత్నించిందీ లేదు. మున్నీ మాత్రం ఆకర్షించింది. మళ్ళీ ఈ లోకంలోకి తెస్తోంది తనని.

ఆదివారం ఊరికి వెళ్లకుండా మున్నీ కోసమే ఉన్నాడు. పని లేకున్నా రెండు మూడు సార్లు కిందకొచ్చాడు.

ఆలశ్యంగా లేచిన మున్నీ కళ్ళు నులువుకుంటూ కింద పార్కింగ్ దగ్గర ఆడుకుంటున్న పిల్లల దగ్గరకొచ్చింది.

"హై మున్నీ"

"హై అంకుల్"

హమ్మయ్య అనుకుని "స్కూల్ లేదా?" తెలిసీ అడిగాడు

"సండే కదా!" జవాబు

"రేపుందా"

"మండే కదా ఉంటుంది". అదేదో సోమవారం తనకు, మొత్తం విదార్థి లోకానికే ఓ శత్రువు అన్నట్టు చెప్పింది.

"బడిలో బాగా ఆడిస్తారట కదా!"

ఊ, ఆడిస్తారు. హోంవర్క్ కూడా ఇస్తారు.

"నీ హాండ్ రైటింగ్ బాగుంటుందట కదా"

"ఊ..."

సిద్ధంగా ఉంచుకున్న చాక్లెట్ ఇచ్చాడు

"థాంక్స్ అంకుల్" అని చెప్పి వెళ్ళిపోయింది ఒక అడుగు ముందుకేసినట్టు ఆనందం.

ఆ పిల్ల మెట్లెక్కి ఇంటికి పోయింది. ఒక నిముషంలో కిందకొచ్చి

"అంకుల్, మా ఇంట్లో వద్దన్నారు" అని చాక్లెట్ వెనక్కి ఇచ్చి వెళ్ళిపోయింది.

"మళ్ళీ ఎప్పుడైనా తీసుకోవాలి"

"ఒకే అంకుల్" అనేసి వెళ్ళిపోయింది.

తొందర పడ్డానా అనుకున్నాడు. నిజంగానే పరిచయం లేని వాళ్ళు ఇస్తే తప్పే కదా అని మనసుకు సర్ది చెప్పుకున్నాడు. అయినా

ఎక్కడో వెలితి.

అనుకోకుండా రాఘవ ఓ రోజు పలకరించాడు. ఉద్యోగం, ఊరూ, రాష్ట్రం, దేశం, ప్రపంచం ఇలా అన్నీ మాట్లాడుకున్నారు. తన వ్యక్తిగత విషయం వచ్చే సరికి మౌనం వహించాడు విల్సన్. రాఘవ కూడా ఇంకా ఎక్కువ మాట్లాడలేదు.

తనక్కావలసిన ఇస్మాయిల్‌ను విల్సనే ఓ రోజు పలకరించాడు. ఆ తరువాత కూడా మున్నీ వాళ్ళ నాన్నతో ఉన్నప్పుడూ పలకరించాడు. ఇప్పుడు మున్నీ కొద్దిగా నవ్వుతూ చూస్తోంది. అలా అలా మున్నీ రోజు విల్సన్ అంకుల్‌ను చూడకుండా, ఆడుకోకుండా ఉండలేనంత దగ్గర కావటం చూసి వాళ్ళ నాన్న ఇస్మాయిల్ కూడా ఆశ్చర్యపోయాడు. "చాక్లెట్ అంకుల్ చాక్లెట్ అంకుల్" అని విల్సన్ చుట్టూ మున్నీ తిరగటం గమనించాడు.

అలాంటి విల్సన్ ఉన్నట్టుండి ఓరోజు తన ఫ్లాట్ ఖాళీ చేశాడు. అదీ రాఘవ, ఇస్మాయిల్ లేనప్పుడు కనీసం చెప్పనయినా చెప్పలేదని ఇద్దరూ అనుకున్నారు. వెళ్తూ వెళ్తూ వాచ్‌మేన్‌కు ఓ ఉత్తరం ఇచ్చాడు. రెండు రోజుల తరువాత ఇస్మాయిల్, రాఘవ ఇద్దరిలో ఎవరికైనా ఉత్తరం ఇవ్వమన్నాడు. వాచ్‌మేన్ అలాగే చేశాడు.

**డియర్ రాఘవ, మస్తాన్ గార్లకు,**

నమస్తే, నేను ఫ్లాటు ఖాళీ చేసి అర్ధాంతరంగా ఎందుకు వెళ్తున్నదీ అందరికీ తెలుసు. అయినా నాకు పరిచయమైన ప్రియ నేస్తాలుగా నేను వెళ్తున్న విషయం మీకు చెప్పటం నా విధి. మీ సముఖం నుండి వెళ్ళకముందే మీకు సమాచారం ఇవ్వవలసింది కాని అపార్టుమెంటులో మీతో చివరి కలయిక నా వీడ్కోలుకు వాడుకోకూడదన్నది నా అభిమతం.



రేపటికి సరిగా సంవత్సరం. ఆ రోజు, నేను నా శ్రీమతి, అయిదేళ్ళ మా పాపతో కారులో వెళుతుండగా జరిగిన ప్రమాదంలో నేనొక్కడినే బతికాను. నా శ్రీమతి అప్పటి నుండీ కోమాలోనే ఉంది. నేను మాత్రమే బతికున్నానన్న సంగతి ఆమెకు తెలియదు. అందుకే "నేనొక్కడినే బతికాను" అని చెప్పాను. ఆ షాకు నుండి తేరుకోవటానికి నాకు నాలుగు నెల్లు పట్టింది. తరువాత కూడా బలవంతంగా, ప్రయత్న పూర్వకంగా జీవితాన్ని కొనసాగిస్తున్నాను అనేకంటే సాగదీస్తున్నాను అని చెప్పవచ్చు.

ఇటువంటి బాధలు వచ్చిన వాళ్ళు కొందరు ఆత్మహత్యకు పాల్పడే అవకాశం ఉంది. కానీ నేను బతకాలనే అనుకుంటున్నాను. ఎవరిచ్చినదో, ఎలా వచ్చినదో కాని మనిషి జన్మను వృథా చేయటం నాకిష్టం లేదు. ప్రతి మనిషి వల్ల ఒక మంచి పని జరుగుతుందని నా నమ్మకం. అది నెరవేరితే చాలు.

మున్నీలో నా కూతురిని చూసుకున్నాను. అంకుల్, అంకుల్ అనుకుంటూ నాకోసం వచ్చినపుడంతా హృదయం నిండా ఎంతో సంతోషం. తనను చూసిన ప్రతిసారీ కళ్ళలో నీళ్ళొచ్చేవి. "ఎందుకేడుస్తున్నావ్ స్కూల్లో నిన్నెవరైనా అరిచారా" అని ఒకసారి మున్నీ అడిగింది. అప్పటినుండీ తన ముందర కన్నీళ్ళు పెట్టుకోలేదు. నా ఫ్లాటులోనే ఎన్నోసార్లు ఆడుకుంటూ అలాగే నిద్రపోయింది. ఇంట్లో వాళ్ళొచ్చి తరువాత ఎత్తుకొనిపోయేవారు.

ప్రతి శనివారం మా ఊరికి పోవాలంటే మున్నీని వదిలి ఉండటం కష్టం. అయినా అక్కడ నా అర్ధాంగి ఏదైనా అద్భుతం జరిగి మనుషుల్ని చూసి గుర్తుపడుతుందేమోనని ఎక్కడో చిన్న ఆశ. ఇంకో పక్క భయం. తనకు ఇవన్నీ తెలుస్తాయేమోనని.

ఎక్కడో చిన్నారుల మీద ఏదో జరిగిందని మున్నీ తల్లిని ఇతరులు జాగ్రత్తపడమని చెప్పటంలో ఎవ్వరినీ నేను తప్పు పట్టటం లేదు. తప్పుగా అర్థమూ చేసుకోలేదు. నన్ను అన్నట్టు కూడా నేననుకోవటం లేదు. మున్నీకి దూరమయ్యానన్న బాధ తప్ప నాలో ఎటువంటి స్పందనా లేదు.

అయితే ఇక్కడ మనకందరికీ సంబంధించి కొన్ని ప్రశ్నలు నా మనసులోనే ఉన్నాయి. వాటికి ఎవ్వరినీ జవాబుదారీగా చేయటం లేదు.

పిల్లలకు ఇప్పటికే పెద్దవాళ్ళను దూరం చేసిన నేటి సామాజిక పరిస్థితులు చూస్తే జాలేస్తుంది. తమ అమ్మమ్మ, నానమ్మ, తాతయ్యాలే కాక పక్కింటి ఆంటీ అంకుళ్లను కూడా రాను రాను వారు కోల్పతారేమోనని అనిపిస్తుంది. ఇది కొంత అతిశయంగా అనిపించవచ్చు. పరిస్థితుల్ని లోతుగా చూస్తేగానీ నమ్మలేము.

అక్వేరియంలో చేపల్ని పెంచినట్టు మనమూ పిల్లల విషయంలో చేస్తున్నాము. బయట సముద్రంలాంటి ప్రపంచంలో అవి తట్టుకోగలగాలి. మన అక్వేరియంలో నీళ్ళు శుద్ధంగానే ఉన్నాయి. ఆ సముద్రంలోనే అన్ని రకాల మలినాలూ ఉన్నాయి.

ఆ మలినాల్ని సమూలంగా తొలగించలేకున్నా కొద్దిగా తగ్గించటానికైనా మనం ప్రయత్నం చేస్తున్నామా? పిల్లల్ని అక్వేరియంలో చేపల్ని పెంచినట్టు మనమూ పిల్లల విషయంలో చేస్తున్నాము. బయట సముద్రంలాంటి ప్రపంచంలో అవి తట్టుకోగలగాలి. మన అక్వేరియంలో నీళ్ళు శుద్ధంగానే ఉంటున్నాయి. ఆ సముద్రంలోనే అన్ని రకాల మలినాలూ ఉన్నాయి.

ఆ మలినాల్ని సమూలంగా తొలగించలేకున్నా కొద్దిగా తగ్గించటానికైనా మనం ప్రయత్నం చేస్తున్నామా? సమాజంలో ఏవైనా ఘోరాలు జరిగినప్పుడు మన స్పందన ఎలా ఉంటుందో? మన పాత్ర ఏమిటి? మన వంతుగా కొద్దిగానైనా మార్పు తెచ్చేందుకు పాటుపడుతున్నామా? ఎక్కడో ఏదో జరిగిన తరువాత మన వరకు మనం జాగ్రత్త తీసుకోవటం మంచిదే. దాన్ని నేను తప్పు పట్టటం లేదు. దానితోనే సరిపోదని మాత్రం కచ్చితంగా చెప్పగలను. ఆలోచించండి సొంతంగా చేయకపోయినా అటువంటివాటి కోసం పాటుపడుతున్న వారికి మన సహకారం ఏ మాత్రం ఉంటోంది? ఒక వ్యక్తిగా మనమేమీ చేయలేనప్పుడు ఇతరత్రా ప్రత్యామ్నాయాలు చూడాలి కదా ! గాలిబ్ గీతంలో "ఓ చుక్క నీరు నదిలో కలిస్తే అది కూడా నది అయిపోతుంది" అని చదివాను. అలా ఉండాలని కోరుకుంటాను కూడా.

ఏమైనా నన్ను కొద్దిరోజుల్లోనే మామూలు మనిషిని చేసిన మీ గృహ సముదాయాన్ని, చిన్నారి మున్నీని ఎన్నటికీ మరచిపోలేను.

ఉంటాను

ఇట్లు "చాక్లెట్ అంకుల్"

విల్సన్

## కవిత

# చివరి చూపు

- మోకారత్నరాజు
9989014767



చినుకు తలచుకుంటే
చేను చెరువై బావురమంటోంది

చినుకు చేతులు కట్టుకుని
ముడుచుక్కూర్చుంటే -
పంటనేల నెరల గాయాల సలుపుతో రోగిష్టి బీడై మూల్గుతోంది

చినుకులు మూకుమ్మడిగా
శివతాండవమాడితే
ఏళ్ళూ ఊళ్ళూ ఏకమవ్వడమేకాదు
నడిరోడ్లు సహితం
చీమలదండుకి చిక్కిన సర్పాల్లా
నిర్జీవమై ఎక్కడివక్కడే పడివుంటాయ్ !

మట్టిని తడిపి, మొక్కను నిలిపే
రైతు; కూలీల చెమట చుక్కలకు సాయంగా
సకాలంలో సరిపడాపడ్డ వాన చినుకులు కలకలుపుగా కలిసి చేదోడై నిలిస్తే
అన్నదాత బ్రతుకు అమృతమయమే కదా !

సరదాగా నేలమీద ముచ్చటపడ్డ చినుకు
వానై వరదై పెనుగాలులతో చెట్టాపట్టాలేసుకుని ఆడుకునే "సై" ఆటలు
నిన్న "లైలా" కావొచ్చు - నేడు "నీలం" కావొచ్చు కాని

తెగిన గట్టులా
కూలిన చెట్టులా
తుపానులో చిక్కుకుని
ఏటేటా ఏట్లోకి కొట్టుకుపోయే రైతన్న చివరి చూపు
గింజను కంకి చేసే "సంజీవి" అనుకూలపు వాన చినుకు కోసమే !

---

# గజల్

- సిరా
9866087709



ఆడగ బోదని విషం నింపితె ఆమ్లమై స్పందించు అంబరం
ఎదురు తిరగదని అణచ బూనితె పోరుయై స్పందించు సంఘం

చుక్కలంటిన పెట్టుబడులతో చేతికందిన కష్ట ఫలము
ధరలు గిట్టక పారబోస్తె పంటశలవై స్పందించు సేద్యం

తాగునీటిని దొరకబుచ్చగ ఓటి కుండలు కవాతుజేస్తె
వాడ వాడల చూడు నన్నని ఏరులై స్పందించుమద్యం

మాంసం కోళ్ళు పెరిగినట్టుగ చదువు గూళ్ళలో ఎదుగు బాల్యం
చలన జ్వలనం రక్తలేమితో హీనమై స్పందించు నవశకం

జనంనెత్తిన ఋణం రుద్ది పూట కూటి పథకాలు పన్నితె
అప్పులిచ్చిన అగ్రనేలకు దాసోహమై స్పందించు దేశం

ప్రజల పాలన పదండంటు పీఠమెక్కిన పెత్తందార్లు
బ్రతుకు హక్కును పరిమార్చిరోయి 'సిరా' యై స్పందించు నిరతం

# పెళ్లికి ముందు వేట - 'టాహిలికి పెళ్లి'



డా. జి. శైలమ్మ
9618361905

**మల్లిపురం జగదీష్ రాసిన 'టిహిలికి పెళ్లి' అన్న కథలో చదువుకొని, లోకజ్ఞానం తెలుసుకొన్న యువతీ యువకులు ఒకర్ని ఒకరు అర్థం చేసుకొని ప్రేమించుకొన్నప్పటికి పెద్దల ఇష్టప్రకారం, సంప్రదాయం ప్రకారం వివాహం చేసుకొన్న తీరు మనకోసం దృశ్యాత్మకంగా వివరించారు.**

పెళ్లిలో బ్యాండుమేళం, ఆట, పాట, మందు, విందు వుంటాయి. పెళ్లంటే ఆబాలగోపాలం కొత్త బట్టలు వేసుకొని మానసిక ఉల్లాసంతో కొత్తకాంతులీనుతుంటారు. పిల్లలు మరీ చెప్పనక్కరలేదు అటు ఇటు చిచ్చర పిడుగుల్లా కొత్త బట్టలేసుకొని తింటూ, ఇంట్లోకి, రోడ్లోకి తిరుగుతుంటారు. దార్లో ఉన్న వస్తువులను తోసేసి మరీ వెళుతుంటారు. అరచినా ప్రయోజనంలేదు. పాలుతాగిన పిల్లిలా జారుకుంటారు. అప్పు చేసైనా పెళ్లి చేసుకొనే ఆచారం ఏ తెగలోనైనా, ఏ సమాజంలోనైనా ఉంది. ఖర్చుతో కూడిన వివాహం వారి వారి స్తోమతను బట్టి ఉంటుంది.

పెళ్లిచేయడానికి ముందు అమ్మాయి, అబ్బాయి తరపు ఏడు తరాలు పరిశీలించి కులం, గోత్రం సరిపడితేనే వివాహం చేసుకొంటారు. ఒక్కో సందర్భంలో తొందరపాటు వల్ల యువతీ యువకుల ఇష్టప్రకారం పెద్దల ఇష్టప్రకారం కొన్ని వివాహాలు జరుగుతుంటాయి. మతాలను బట్టి, ధనిక పేద వర్గాలను బట్టి వివాహాలు వేరైనా సమాహారంగా అమ్మాయిని అబ్బాయి పెళ్లి చేసుకొంటారు. గిరిజన ప్రాంతాల్లో ఇప్పుడిప్పుడే చదువుకోవడం అలవర్చుకొన్న కొంతమంది ప్రేమించుకోవడం, వారి ఇష్టప్రకారమే పెద్దలను ధిక్కరించి వివాహం చేసుకొంటున్నారు.

మల్లిపురం జగదీష్ రాసిన 'టిహిలికి పెళ్లి' అన్న కథలో చదువుకొని, లోకజ్ఞానం తెలుసుకొన్న యువతీ యువకులు ఒకర్ని ఒకరు అర్థం చేసుకొని ప్రేమించుకొన్నప్పటికి పెద్దల ఇష్టప్రకారం, సంప్రదాయం ప్రకారం వివాహం చేసుకొన్న తీరు మనకోసం దృశ్యాత్మకంగా వివరించారు.

గిరిజన తెగకు చెందిన టిహిలి డిగ్రీ చదువుతుంది. ఒరిస్సా సరిహద్దు ప్రాంతంలో సందుబడి గ్రామానికి చెందిన ధర్మ 'గిరిజన కళలు' అన్న అంశంపై పరిశోధన చేస్తున్నాడు. ధర్మ కుటుంబం ఆంధ్రా ప్రాంతం నుండి వలసవెళ్లిన, వాళ్లే. ధర్మ కూడా గిరిజన తెగకు చెందిన వాడు. ధర్మ తన వాళ్ల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు అందరికి తెలియజేయాలన్న సంకల్పంతో ఈ పరిశోధనకు ఉపక్రమిస్తాడు. పరిశోధనలో భాగంగా టిహిలిని ధర్మ ప్రేమించి పెద్దల ఇష్ట ప్రకారం వివాహ చేసుకుంటాడు.

వీరి ఆచారం ప్రకారం వివాహానికి ముందు ఏదైనా జంతువుని వేటాడి పెండ్లి కుమార్తెకు తెచ్చివ్వాలి. ఈ ఆచారాన్ని గిరిజనులు కొనసాగించడంలేదు. ఇలా వేటాడి జంతువుని తెస్తే పెండ్లి కుమార్తెను పోషించుకోగలుగుతాడని, ఆ ఊరి ప్రజలు, పెండ్లి కుమార్తె తల్లిదండ్రులు నమ్ముతారు.

ధర్మ గిరిజనుల కళలపై మక్కువతో పరిశోధన చేయడంవల్ల తమ కళల పట్ల, సంప్రదాయ ఆచారాల పట్ల గౌరవభావమున్న వ్యక్తి గనుక తను వివాహానికి ముందు వేటకెళ్లి చెట్లల్లో పుట్టల్లో ఒంటరిగా పరిగెత్తి శరీరమంతా గాయమయ్యి ఎలాగోలా కుందేలును తెచ్చి కాబోయే భార్య టిహిలికి అందిస్తాడు.

ఈ కథలో ఉపయోగించిన పాటలు గురించి

తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ధర్ము పని చేసుకుంటూ కొందు భాషలో పాట పాడుకొంటాడు.

నప్పు కంబేతె దక్లి కంబేతె ఆలిరోదువాత
(అలిరోదూత కోండ మీదనార దుంపలు పండేయి)
సీటి రాచ్చము ఆకు రాచ్చము సోంగదొరూత
చీటి రాసింది ఆకు మీద, వెదురు బొంగు మీద వస్తానని

పని చేసుకుంటూ పాడే పాటవల్ల కష్టాన్ని మరిచిపోగలుగుతారు. అల్లుడు అత్తను ఉద్దేశించి పాడే పాట.

జెకే పూరుతి మల్లీ పూలు జుడ్డతిబాషణ
(జేకే వూరు పిల్ల తలలో మల్లెపూలు ముడిచింది)
ఎంచి హచ్చె అమ్మపోద అమ్మ గట్టేలి పానాన్న
(ఇక్కడ మంచయేసి ఎటు వెల్లిపోయిందత్త)

ఈ గేయాలు సాధారణంగా పాడుకుంటారు. వారి పని పాటలు, వివాహతంతు కంటికికట్టినట్లు, తన రచనలో ప్రతిఫలింపజేసిన రచయిత మల్లిపురం జగదీష్.

ధర్ముచేత కువి భాషలో మరోపాట పాడిస్తాడు రచయిత.

అన్నమి వేసన్న గుది కియాతి (అత్తకి చెప్పి కొట్టించింది)
మామ్మ ఆ వేసన గుడి కియాతి (మామకి చెప్పి కొట్టించింది)
వేహము అమ్మ వేల్లి హాతవి హాజి (అత్తా చెప్పు నీ కూతురు బయటకురానీ)
మన్నామి పూయు హినమి హా (పువ్వు యిచ్చి వెళ్ళిపోతాను)

భాషలు వేరైనా ప్రేమ భావాన్ని చెప్పుకోడానికి అనుసరించే పద్ధతి ఒక్కటే. ప్రేయసి ప్రియులు ఏదైనా వస్తువులు పువ్వులు, చేతిగుడ్డలు, తినుబండారాలు ఇలా వారి వారి స్థోమతను బట్టి ఇచ్చిపుచ్చుకోవడం ఉంటుంది. వారి గేయాలపై ఇంకా పరిశోధన సాగించాలి. గేయాలు మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా పాడటం తక్కువయి అనంమూర్తిగా మిగిలిపోతున్నాయి. టిహిలికి పెళ్లి, ధర్ము వేటకెళ్లడం, వివాహతంతు వివరించిన తీరు కథ చదువుతున్న పాఠకుడు కంటి ముందు జరిగినట్లు ఉంది.

**వివాహతంతు :**

పెళ్లి జరుగుతున్న గృహం ఎలా ఉంటుందో అందరికి తెలుసు. మరి గిరిజనులు ఎలా చేస్తారు? అంటే సమాధానంగా 'టిహిలికి పెళ్లి' కథలో వివాహం జరిగే కుటుంబం, పెండ్లి పందిరి అలంకరించిన విధానం ప్రత్యక్షీకరించబడింది.

"ధర్ము ఇంటి ముందు పచ్చని పెళ్లిపందిరి, పందిరికింద నులక మంచం. మంచం మీద కుంచం. కుంచంతోపాటు రోకలి, మోకు, ఇంటి ద్వారానికి ఎదురుగా అప్పుడే తవ్విన చిన్నకాలువ. పందిరి నిండా అడవిపూల పరిమళాలు" పు : 36.

పెళ్లిపందిట్లో కాలువ ఎందుకు అని పరిశీలిస్తే కొత్త దంపతులు దేవతకు ఒక కోడిని బలి ఇస్తారు. బలి ఇచ్చిన కోడి రక్తం కాలువలో ప్రవహించేలా చేస్తారు.

"ఇంటి ముందు తవ్విన కాలువపై తన వెనకే నిలబడి ఎజ్జోడి దీవెనలందుకున్న ధర్ము... ఇద్దరి పాదాల మధ్య నుంచి గుగ్గిలం పొగలుకక్కుతున్న నిప్పుల్ని కాలువ దాటించినపుడు, ఇద్దరిపాదాల మధ్య నుంచి కోడిని బలిచ్చిన రక్తాన్ని కాలువలో పారినట్లు నీరుపోసినపుడు..." పు : 36.

కుంచం ఎందుకంటే బోర్లించిన కుంచంపై పెండ్లి కుమార్తె కాలుపెట్టించి, పెండ్లి కుమారుడి చేత ఆమె పాదాన్ని తొక్కిస్తారు. దీసరి పెళ్లితంతు ముందుండి జరిపిస్తాడు. రోకలిని వివాహం జరిగేచోట పెట్టి పూజలు చేస్తారు. పెండ్లి కుమారునికి, పెండ్లి కుమార్తెకు మధ్యలో పెడతారు. రోకలి మీదుగా పెండ్లి కుమార్తె మెడలో తాళి బొట్టుకడతారు. పెళ్లి అన్నాక విందు భోజనాలు, మందు తప్పనిసరి. అందరు తిని తాగి ఆనందిస్తారు.

వీరి ఆచారాలు నలుగురికి తెలిజేయాలన్న సంకల్పం రచయితలో స్పష్టంగా కనిపిస్తుంది. అంతరించిపోతున్న గిరిజనుల రకరకాల కళలను, సంప్రదాయాలను రచనా రూపంకావిస్తున్న రచయిత కృషి హర్షనీయం.



---

# లంచం

హిందీ : ధనంజయ్ ప్రసాద్
తెలుగు : వేదుల రామకృష్ణ
9989033403

లంచం
నేడు సంస్కారంగా మారింది.
పట్టణాల్లోనే కాదు,
గ్రామాల్లో కూడా పరిపాటి అయిపోయింది.
లంచంతోనే ఇపుడు పనులన్నీ అవుతాయి.
పేరు ప్రఖ్యాతులు వస్తాయి
బతకటానికి లంచం.
చావటానికి లంచం
ఉపాధి కలగటానికి,
ఉద్యోగం దక్కటానికి,
చెంతన చేరటానికి
మాట వినిపించటానికి



మానానికి, ప్రాణానికి,
గౌరవ సన్మానానికి
అన్నిటికీ లంచం.
కింద నుండి పైపైకి లేపుతుంది
లంచం.
లంచమే లంచం.
జగమంతా లంచాలమయం.
మనిషికే కాదు
ఇహ దేవుడికి కూడా కావాలి లంచం.
ఏపనైనా సాధించటానికి
నేడు ప్రామాణికం లంచం

# ఢమరుధ్వని !

రాయప్రోలు సత్యప్రసాద్



ఒక్క గెలుపు లాటరీతో
సింహాసనం ఎక్కి
జీవితమంతా వైకుంఠపాళీ నిచ్చెనలు ఎక్కేస్తాడు
పాముల కుబుసాలు తీసి ప్రజల్ని మింగడానికి వదిలేస్తాడు
ఓట్లకి నోట్లు పంచిన అనుభవంతో
కోట్లకి వారసుడయి
పదవిలో ఉండగానే
పట్టు పురుగులా దేశాన్ని తినేస్తాడు
పదవి పదిలం కోసం
చట్టాన్ని తన చట్రంలో బిగించి
నేతి బీర మాటలతో
నేతని తానేనని ప్రజలని జో కొడతాడు
చేసే సేవల ప్రతిఫలమంటూ
బతుకు "పసిడి" చేసుకుంటాడు
వాడికి...
బంగళాలు ఫ్రీ, ప్రయాణాలు ఫ్రీ
చివరికి -
చచ్చాక ఊరేగింపులు కూడా
ప్రభుత్వమే జరుపుతుంది ఫ్రీగా
వాడొక ఊసరవెల్లి
పార్టీలు మార్చే గోడ మీద పిల్లి
వాడే నేటి రాజకీయం !!
దేశంలో మేధావులంతా
మకిలి అంటుకుంటుందని
తేనేటీగల్లా కడుపు నింపుకుని
కళ్ళు చాటేస్తున్నారు
నిద్రపోతున్నట్లు నటిస్తున్నారు
మరి ఎన్నాళ్ళిలా ?
సామాన్యుడు సవారీ మోస్తునే ఉంటాడు ?
బతుకును బలిపీఠానికి బాదుకుంటాడు ??
అందుకే -
మీ శక్తులు సమీకరించి
మీ యుక్తులు ప్రేరణగా
మీకు మీరే వెన్ను దన్నుగా
సమరాంగణ మూర్తులుగా
జయశంఖం పూరించండి
గోడకీ - మేడకీ నినాదాలు మార్చండి
నేతకీ నీతికీ శాసనాలు చేయండి
ఆ నినాదం నాందిగా
ఆ శాసనం అస్త్రంగా
ప్రచ్ఛన్న యుద్ధం చేయండి
మోడు బతుకుల గతులు మార్చుకోండి
పచ్చదనాల తోరణాలతో
భవితని సరిదిద్దుకోండి
ప్రజాసేవ పేరుతో...
పసిడి సింహాసనాలపై కూర్చున్న నేతల్ని
నేలకీడ్చి, న్యాయాన్ని నిలదీయండి
ప్రజాసామ్య క్రాంతి కోసం
ఢమరుధ్వని మ్రోగించండి !!!

---

# నానీలు !

- వెన్నెల సత్యం
9440032210



కల..
మూసిన కనురెప్పలపై
కదలని అల..!

మనసు..
మమతానురాగాల
ఇంద్రధనుసు..

అనురాగం..
మనిషికీ, మనసుకీ మధ్య
ఆత్మీయతా సరాగం..

పసిపాప..
బోసి నవ్వులు చిందించే
అపురూప కాంతిదీప..!

మౌనం..
మనసు ఏకాంతంలో
చేసుకునే ధ్యానం!

కన్నీళ్లు..
కనుల కొలనులో
కాపురముండవులే చాన్నాళ్లు!

అధరం..
అందిన ద్రాక్షలా
అతి మధురం..

దరహాసం..
సుందర దరహాసంపై
అరుదెంచే మధుమాసం!

స్వార్థం..
నిలువెల్లా నిండితే
నీ జీవితం వ్యర్థం..

అమ్మపాలు..
డబ్బాల్లో.. అమ్మకానికి
మరి.. అమ్మతనం..

కథ

# విభిన్న వేషాలు

డా॥ కె. చంద్రమౌళిని
9491407655



అలారం మోగుతూనే వుంది. అప్పటికది ఆరోసారి మోగడం. ప్రతి ఐదు నిమిషాలకు ఒకసారి ఆఫ్ చేసేదాకా మోగుతూనే వుంటాది. దాని మోత వినలేక కళ్యాణి బద్ధకంగా లేచి ఆఫ్ చేసింది. టైం ఐదున్నర అయింది. రోజూ ఐదుకంతా లేచేది. బాబు రాత్రంతా దగ్గుతూనే వుండడంతో నిద్ర చెదిరి లేవలేకపోయింది.

"అబ్బా... నిద్ర ముంచుకొస్తుంది. ఇంకాసేపు పడుకోవాలనుంది. కానీ ఈ రోజు స్టడీ అవరుంది. తప్పకుండా పోవాల్సిందే. లీవ్ పెట్టేదానికి కుదరదు.. లేవక తప్పదు" అనుకుంటూ లేచి వంటింట్లో కెళ్ళింది.

ముందురోజు రాత్రే బీరకాయలు తరిగి పెట్టింది. చపాతీ పిండి కూడా తడిపి పెట్టింది. కాబట్టి టిఫిన్ పని తొందరగానే ఐపోతుంది. మధ్యాన్నం భోజనానికేం చేయాలా అని ఆలోచించి టమేట పండ్లు బాగా మాగినాయి కదా అని, వాటిని ఉడకబెట్టి, వెల్లుల్లి, ధనియాల పొడి యాలకులు, లవంగాలు, చెక్క దంచి మసాలా పులుసు తయారు చేసింది. ఓవైపు వంట పనులు కానిస్తూనే, మరోవైపు కసువు లూడ్చుకుని బండలు కడిగేసింది. పిల్లలు లేచే లోపల వంటపని, ఇంటిపని పూర్తి చేసేసి క్యారియర్లు కట్టేసింది.

కళ్యాణి జిల్లా పరిషత్ హైస్కూల్లో స్కూల్ అసిస్టెంట్‌గా పనిచేస్తుంది. ఆమె భర్త బ్యాంకు మేనేజరుగా వేరే ఊర్లో పని చేస్తూ, వారానికోసారి వచ్చి వెళుతుంటాడు. దాంతో ఇంటి బాధ్యతలు, పిల్లల మంచీ చెడ్డా మొత్తం కళ్యాణే చూసుకోవాల్సి వస్తుంది. ఇద్దరు పిల్లలు. పాప నాలుగో తరగతి, బాబు రెండో తరగతి. ప్రతిరోజూ పిల్లలిద్దరినీ స్కూలు దగ్గర వదిలేసి, ఆ తర్వాత బస్టాండుకెళ్ళి తను పనిచేసే ఊరికెళ్ళే బస్సెక్కుతుంది. ముక్కాలు గంట ప్రయాణం. స్టడీ అవరున్న రోజు ఇంకో గంట ముందుగా వెళ్ళాల్సి వుంటుంది. పాపం పిల్లలు కూడా స్టడీ అవరున్న రోజు స్కూలుకు గంట ముందుగా వెళ్ళిపోతారు. ఆ టైంకు ఎవరూ వచ్చి వుండరు. తప్పదు

ఇంట్లో చూసుకునే వాళ్ళెవరూ లేకపోవడంతో అవసరమైనప్పుడల్లా వాచ్‌మెన్‌కు జాగ్రత్తలు చెప్పి పిల్లల్ని స్కూల్లో వదలి వెళ్ళిపోతుంది. కళ్యాణి. తను ఎప్పుడైనా స్కూల్ నుంచి రావడం ఆలస్యమైనపుడు కూడా తను వచ్చేవరకు పిల్లలు స్కూల్లో అలానే ఎదురు చూస్తూ కూర్చుంటారు.

"లేవండమ్మా.. నాకు టైమైపోతుంది.. లేవండి.." పిల్లలు ఇంకాసేపు నిద్రపోతామంటున్నా తప్పదన్నట్లు బలవంతంగా నిద్రలేపి నేరుగా బాత్రూంలోకి తీసుకెళ్ళింది. గబగబా పళ్ళుతోమి, స్నానాలు చేయించేసింది. యూనిఫాం వేసి, టైలు కట్టి, బెల్టులు పెట్టి, సాక్సులు తొడిగి, షూలు వేసి, తలలు దువ్వి, పౌడరు పూసి తయారు చేసింది. ఇద్దరికీ టిఫిన్ తినిపించి, పాలు తాపించేసింది. ఎంత త్వర త్వరగా పనులు పూర్తి చేసినా ఎప్పుడు టైం ఐపోతుందో ఐపోతుంది. ఇంక బైలుదేరడానికి పది నిమిషాలు మాత్రమే వుంది. గబ గబ స్నానం చేసేసి, చీర చుట్టేసుకుని, జుట్టు చిక్కులు తీసుకోవడానికి టైం లేక అలాగే జడ అల్లేసుకుంది. ఆకలవుతున్నా తినేంత టైం లేక చపాతీలు బాక్సులో పెట్టేసి, బ్యాగులో పడేసింది. ఇంటికి తాళమేసి పిల్లలిద్దరి స్కూలు బ్యాగులు, లంచ్ బుట్టలు, తన బ్యాగు రెండు చేతులకూ తగిలించుకుని గబగబా నడచుకుంటూ, బ్యాగుల బరువు తట్టుకోలేక, వేగంగా నడవలేని పిల్లల్ని హెచ్చరిస్తూ పదినిమిషాల్లో పిల్లలు చదివే స్కూలుకు చేరుకుంది. వాళ్ళనొదిలేసి మరో పదినిమిషాల నడకతో బస్టాండుకు చేరుకుంది. బస్సింకా రాలేదు. ఈరోజు తనతో పాటు మాధవికి కూడా స్టడీ అవరుందన్న విషయం గుర్తొచ్చింది. బైలుదేరిందో లేదో కనుక్కుందామని ఫోన్ చేసేంతలో దూరంగా మాధవి కనిపించింది. చంకలో జారిపోతున్న పాపను పైకి లాక్కుంటూ, చేతికో బరువైన బ్యాగును తగిలించుకుని ఆయాసపడుతూ వచ్చింది మాధవి. ఇద్దరూ ఒకరినొకరు పలకరించుకునేలోగా బస్సొచ్చేసింది. బస్సులో సీట్లు దొరికినందుకు ఇద్దరూ సంతోషించారు.



"హమ్మయ్య. పొద్దున లేచాక మళ్ళీ కూర్చున్నది ఇప్పుడే. అదృష్టం, సీటు దొరికింది" అంటూ పాపను దగ్గరికి తీసుకుంది కళ్యాణి.

"అబ్బబ్బబ్బ.... పాపను ఎత్తుకోని ఎడం చెయ్యి, బ్యాగును మోసి కుడి చెయ్యి... ఇంకొన్ని రోజులైతే నా రెండు చేతులూ చచ్చుబడిపోతాయేమో" అంది చేతులు ఒత్తుకుంటూ మాధవి.

మాధవి మాటలను విన్న ముందు సీట్లో ముసలమ్మ వెనక్కు తిరిగి "ఉజ్జోగం చేస్తుండారమ్మా మీరిద్దరూ" అంది కళ్యాణిని, మాధవిని చూస్తూ.

అవునన్నట్లు ఇద్దరూ తలాడించారు.

"చంటిదాన్ని ఇంట్లోనే వదిలిపెట్టకుండా, రోజూ ఇట్టా తిప్పితే ఆరోగ్గిం భంగమైపోదా" అంది ముసలమ్మ.

"ఇంట్లో చూసుకొనేటోళ్ళే వుంటే ఎందుకెత్తుకుని తిప్పుతార్లే గాని ముందు టికెట్‌కి డబ్బుల్ తియ్యి" అంది లేడీ కండెక్టర్.

కళ్యాణి, మాధవి తమ రోజువారీ ప్రయాణంలో పరిచితమైన లేడీ కండక్టర్ వైపు చూసి చిరునవ్వు నవ్వారు.

కాలేజీల టైము, ఆఫీసుల టైమూ కావడంతో బస్సు క్రిక్కిరిపోయింది. "మనం బస్టాండ్‌లో ఎక్కుతున్నాం కాబట్టి సీట్లు దొరుకుతున్నాయి కానీ లేదంటే నిలబడి ప్రయాణం చేయాల్సి వచ్చేది" అంది కళ్యాణి.

రోడ్డును పట్టుకుని వేలాడుతున్న జనాలను తోసుకుంటూ, నిలుచునేందుకు సరైన స్థలం లేకపోయినా, పట్టుకునేందుకు ఏ ఆధారమూ లేకపోయినా చక చక టిక్కెట్లు కొట్టేస్తున్న లేడి కండక్టర్‌నే గమనించసాగింది. కళ్యాణి.

"మనం కూర్చుని చేసే ఈ కాస్త ప్రయాణానికే ఉసూరంటాం. ఆమె రోజంతా ప్రయాణంలోనే డ్యూటీ చేయాలి. మగాళ్ళను తోసుకుంటూ, ఒరుసుకుంటూ.. ఇంత రద్దీలో దారి చేసుకుంటూ.. అడుగడుగునా స్టాపులొస్తుంటే.. స్టాపొచ్చేలోగా టికెట్ల పని పూర్తి చేసుకుంటూ, కదిలే బస్సులోనే వివరాలన్నీ రాసుకుంటూ, డబ్బు లెక్క చూసుకుంటూ.. నిజంగా ఈ ఉద్యోగం చేయడానికి ఎంత ఓర్పుండాలి కదా" అంది కళ్యాణి.

"నిజమే కళ్యాణీ.. ఓర్పుండబట్టే మనం ఇంటా, బయటా రెండు చోట్లా చాకిరీ చేస్తున్నాం. కానీ ఎంత చాకిరీ చేస్తున్నా ఏం లాభం? మన సంపాదన మనదీ అని చెప్పుకోలేనప్పుడు.. గతంలోనే నయం. జీతాలు చేతికిచ్చేవాళ్ళు. అప్పుడు కూడా

తీస్కోపోయి మొగుడి చేతుల్లో పెట్టేదే అయినా కనీసం మన నెల కష్టాన్ని చేతులారా తాకిన తృప్తయినా మిగిలేది. కానీ ఇప్పుడు చూడు పరిస్థితి ఇంకెత ఘోరంగా వుందో. ఆన్‌లైన్ జీతాలొచ్చినాక ఆ తృప్తి కూడా దక్కకుండా పోయింది. ఏ.టి.ఎం కార్డులు మొగుళ్ళ జేబుల్లోకి వెళ్ళిపోయి రోజువారీ ఖర్చీలక్కూడా ప్రతిరోజూ చెయ్యి చాచాల్సొస్తుంది" బాధపడుతూ అంది మాధవి.

కళ్యాణి మౌనంగా వుండిపోయింది.

"ఆయనకేం... అన్నీ చేసి కూర్చున్న చోటికే తీస్కపోయి ఇస్తే, హాయిగా తినేసి, తన టైంకు తాను బైకెక్కి వూరేగుతాడు. ఒక్క పనిలో కూడా సాయం చేయడు. అసలు ఇంటి గురించి గానీ, నా గురించి గానీ, చంటి దాని గురించి గానీ ఒక్క క్షణం కూడా ఆలోచించడు. ఆయన ఆఫీసు, ఆయన ఉద్యోగం అంతవరకే. ఇంట్లో బాగలేకపోయినా చచ్చినట్టు అన్ని పనులూ చేసుకోవాల్సిందే, పాపను తయారు చేసుకుని బైట పడాల్సిందే. ఒక్కోసారి ఆయన మీద కోపంతో, నా మీద జాలితో ఉద్యోగం మానేయాలనిపిస్తుంది. కానీ మానేయలేని పరిస్థితి. చచ్చీ చెడీ ఇంత చేస్తున్నా ఏ రోజూ నన్ను పట్టించుకున్న పాపాన పోలేదు. కనీసం తిన్నావా అని అడిగే దిక్కులేదు" కళ్ళ నీళ్ళు పెట్టుకుంది మాధవి.



మాధవి మాటలు విన్న ముసలమ్మ వెనక్కు తిరిగి "సదువుకున్నోళ్ళకు కూడా ఇన్ని బాధలుంటాయా... ఉజ్జోగం చేసే ఆడాళ్ళను సూసినప్పుడల్లా.. ఈళ్ళకేం ఈళ్ళ జీతము, మొగుడి జీతము.. రెండు జీతాలు మంచి మంచి కోకలు కట్టుకుని, బాగా సింగారించుకుని తిరుగుతుంటారనుకున్నా.. మీ మాటలింటుంటే మా పేదోళ్ళకు ఒకరకం కష్టాలు.. మీకు ఇంకోరకం కష్టాలు వున్నట్టున్నాయనిపిస్తా వుంది. నా మొగుడు సేద్యం చేసి సంపాదించేదంతా కల్లుదుకాణంలో తగలబెట్టేటోడు. నా రెక్కల కష్టంతోనే ఇద్దరాడపిల్లల మనువులు జేసినా, వాళ్ళకు కాన్పులు జేసినా ఆఖరి పిల్ల సదూకుంటాననంటే సదివిస్తున్నా. నా మొగుడు యేనాడూ సంసారం గురించి పట్టించుకున్నది లేదు. పుస్తె కట్టించుకున్న పొద్దు నుంచి ఇయ్యాల వరకూ నా బతుకులో సుకుమన్నదీ లేదు. యానాడన్నా సంతోషంగా వున్నదీ లేదు. తాగీ తాగీ ఒళ్ళు పాడు జేసుకుని మంచాన పన్నాడు. సంటిపిల్లోన్ని సాకినట్టు సాకుతావున్నా. మొగాని ఆసరా లేకున్నా ఆడది జయిస్తాది. కానీ ఆడదాని తోడు లేకుంటే మొగోడు బతకలేడు" అంది.

ముసలమ్మ మాటలు విన్న లేడీ కండెక్టర్ "నిజం చెప్పినావ్ ఆడోళ్ళులే. వీళ్ళకేం చేతనైతాది అనుకునేటోళ్ళు ఒకప్పుడు. ఇప్పుడల్లా కాదు నేను ఉద్యోగంలో చేరిన కొత్తల్లో ఆడోళ్ళ సీట్లలో కూర్చున మొగాళ్ళను లేపేదానికి, బస్సులో సిగరెట్లు, బీడీలు తాగే వాళ్ళను మందలించడానికి, కాలో చెయ్యో కావాలని తగిలించేటోళ్ళని నాలుగు దులపటానికి వెనకా ముందయ్యేదాన్ని. ఇప్పుడా భయం లేదు. చూస్తా వుండు రేపో మాపో లేడీ డ్రైవర్లు బస్సులు నడిపే రోజులొస్తాయి. ఈరోజుల్లో ఆడోళ్లు చేయిని పనంటూ ఏదీ లేదు అంది.

"కానీ మన కాళ్ళ మీద మనం నిలబడే ప్రయత్నం చేస్తున్నా, కాలు మీద కాలేసుక్కూర్చునే రాత లేకుండా పోయింది. పొద్దు పొడిచే కన్నా ముందే మొదలయ్యే మన దినచర్య రాత్రి పొద్దుపోయే వరకు సాగుతూనే వుంటుంది. భార్యగా, కోడలిగా, తల్లిగా, ఉద్యోగిగా.. అంతేకాదు వంట మనిషిగా, పనిమనిషిగా, నర్సుగా... అనేక పాత్రలను పోషిస్తూ ఇంటా బయటా డబలాక్షన్ చేస్తున్నాము. అలా చేయడం మన బాధ్యత అని పూర్తిగా ఆ పాత్రల్లో ఇమిడిపోతున్నాము. అంకిత భావంతో పని చేస్తున్నాము. ఇల్లలుక్కుంటూ పేరు మరిచిపోయిన ఈగలాగా హక్కుల్ని మరచిపోతున్నాము. మన శ్రమకు గుర్తింపు రావాలి. మన సంపాదన మన చేతుల మీదుగా అవసరాలు తీర్చాలి. మనల్ని మనుషులగా గౌరవించాలి అంటున్న కళ్యాణి మాటలు విని మాధవి

"అవి జరిగే పనులేనా?" అనడిగింది నిరాసక్తంగా.."

"ఏదో ఒకరోజు తప్పకుండా జరుగుతాయి జరిగి తీరుతాయి. ఆడవాళ్ళు సహనంతో, ఓర్పుతో నోరెత్తకుండా వున్నంత కాలమే మొగుళ్ళ పెత్తనం కొనసాగేది. ఎంతకాలం మౌనంగా భరించగలరు? నిశ్శబ్దం బద్దలైన రోజున మన విశ్వరూప మేంటో అర్థమౌతాది" అంది లేడీ కండక్టర్.

ఆ రోజెంతో దూరంలో లేదన్న ఆశాభావంతో చిరునవ్వులు నవ్వుతూ తాము దిగాల్సిన స్టాపు రావడంతో కళ్యాణి, మాధవి పాపతో బస్సు దిగేశారు.



# ఎ.ఎన్. జగన్నాథశర్మ కథలు-
# సామాజిక, కుటుంబ సంబంధాలు

కె. నరసింహుడు
8978248551




"రస ప్రధానాశ్శబ్దార్థా గుణాలం కార వృత్తయః
రీతియశ్చేయతే శాస్త్ర ప్రమేయం కార్య పద్ధతిః"

అని విధ్యానాధుడు కావ్యసరళిని గురించి పేర్కొన్నాడు. సామాజిక సంఘటనకు రసాలనీ, శబ్దార్థాలనీ, గుణాలనీ, రీతులనీ, అలంకారాలనీ జోడించి చెప్పడమే సాహిత్య సాంప్రదాయమని నిర్వచించవచ్చు. ఎంతటి వాళ్ళకైనా సమాజాన్ని అర్థ ంచేసుకోకపోతే సాహిత్యాన్ని అర్థం చేసుకోవడం కూడా దుర్లభమౌతుంది. లోకజ్ఞత, మానవతాత్పర్యం, విజ్ఞత, వైదుష్యం, పరిపక్వదృష్టి, కరుణ, సత్యసంధిత, ధీరత్వం మొదలైన లక్షణాలున్నవాడే కవి. సాహిత్యం సిసలైన సామాజికతకు ప్రతిరూపం. అందుకే అది వింతల్ని చూపిస్తూ నవ్విస్తుంది. విశేషాల్ని చూపిస్తూ కవ్విస్తుంది. విషమ సమస్యల్ని చూపిస్తూ ఏడిపిస్తుంది. అసలు నవ్వుల మధ్య కంటతడి పెట్టించడమే ఉత్తమ సాహిత్య లక్షణంగా చెప్పబడుతుంది. తెలుగు కథకుల్లో గురజాడ నుండి నేటి తరం వరకూ అందరూ సామాజిక స్పృహతో కూడిన ఇతివృత్తాలతో కథలు రాసినవాళ్ళే.

కథ పుట్టిన తొలినాళ్ళలో కథకులు సామాజిక సమస్యల్ని ప్రాంతీయతకు అతీతంగా తమ కథల్లో చిత్రించినా, ఆ తర్వాత రాను రానూ ప్రాంతీయ స్పృహ పెరిగి ఆయా ప్రాంతాల కథకులు తమ ప్రాంతపు సమస్యల్ని, తమ చుట్టూ వున్న సమాజాన్నే కథల్లో చిత్రించడం ప్రారంభించారు.

ఆ పరంపరలో ప్రస్తుతం ఎ.ఎన్. జగన్నాథశర్మ తన కథల్లో స్పృశించిన సామాజిక అంశాల్ని చర్చిద్దాం.

మానవుడు ఆటవిక దశ నుండి నాగరిక జీవితానికి అలవాటు పడుతున్న దశలో కుటుంబ జీవనం ప్రారంభమైందని చెప్పవచ్చు. నా ఇల్లు, నా ఆస్తిపాస్తులు అనే భావాలే కుటుంబ వ్యవస్థకు పునాది. ఈ కుటుంబ వ్యవస్థకు స్త్రీ, పురుషులు మూల స్తంభాలు. వీరిరువురు ఒకరిపై ఒకరు ప్రేమను కురిపించుకుని కలిసి జీవించాలని అనుకోవడంతో కుటుంబ జీవనం ప్రారంభమౌతుంది. మానవుడు తన సహజ వాంఛల్ని సక్రమ పద్ధతిలో తీర్చుకునే ఉత్తమ సాధనమే కుటుంబం.

ఆనందమైన కుటుంబ జీవనం ఆ కుటుంబీకుల శక్తి సామర్థ్యాల మీదనే ఆధారపడి ఉంటుంది. కుటుంబం అన్న తర్వాత ప్రతి వ్యక్తి స్వార్థాన్ని విడనాడి నిస్వార్థంతో బాధ్యతల్ని గుర్తించి ప్రవర్తించడం, సద్విమర్శలను స్వీకరించి తమకు తాముగా సంస్కరించుకోవడం ఎంతో అవసరం. చిన్నవాళ్ళ అవసరాలను గుర్తించి వాటిని తీర్చడానికి ప్రయత్నించడం, వాత్సల్యంతో అభిమానించడం తెలుసుకోవాలి. వచ్చిన సమస్యలను, కష్టాలను సామూహికంగా ఎదుర్కొని పరిష్కరించుకోవడం, నిబ్బరమైన ఆలోచనలు కలిగి వుండటం ఎంతో మంచిది. ఆపదలో, అనారోగ్యంలో, శైశవదశలో, వృద్ధాప్యంలో అండగా నిలిచేది కుటుంబమే. కుటుంబ జీవనం కేవలం వంశాన్ని నిలిపే సాధనమే కాదు, సంస్కృతి, సంప్రదాయాలనూ వ్యాపింపచేసే వాహిక.

ఉమ్మడి కుటుంబం చిన్న సమాజం లాంటిది. ఇందులో ప్రతి ఒక్కరూ సభ్యత్వం కలిగి వుంటారు. ఉమ్మడి కుటుంబానికి తండ్రి మకుటంలేని మహారాజు. కుటుంబంలో విభిన్న మనస్తత్వాలు గల మనుషులుంటారు. వారి పద్ధతుల్లో కూడా వైవిధ్యముంటుంది. అందువల్ల అప్పుడప్పుడు వారి మధ్య సంఘర్షణ తలెత్తే ప్రమాదం కూడా ఉంది. ఎలాంటి ఒడిదుడుకులు వచ్చినా సర్దుకుపోయే మనస్తత్వం గలవాళ్ళు కొంత మందైనా ఉండటం వల్లనే ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఇంకా కొద్దిగానైనా నిలబడి వుంది.

సామాజిక జీవితానికి మూలకేంద్రం కుటుంబ వ్యవస్థ. సామాజిక పరిణామ క్రమంలో కుటుంబ వ్యవస్థ ఎన్నో ఆటుపోట్లకు, ఒడిదుడులకు లోనయ్యింది. సామాజిక పరిణామాలు మానవ జీవితంలోని అన్ని పార్శ్వాలను మార్పుకు గురిచేసినట్టుగానే కుటుంబ వ్యవస్థను కూడా పెనుమార్పులతో కుదిపివేస్తున్నాయి. తత్ఫలితంగా తరతరాల కుటుంబ వ్యవస్థలోని సమిష్టి దృక్పథం, సమైక్యభావన తలకిందులైనాయి. కుటుంబ జీవనంలో శ్రేయస్సుకు ప్రాముఖ్య పెరిగింది. కుటుంబంలోని వ్యక్తుల మధ్య నున్న సంబంధాల్లో




మానవీయ దృక్పథం కరువైపోతూ వుంది. సామాజిక జీవనంలోని 'ఆర్థిక విలువల' దుష్ప్రభావం కుటుంబ వ్యవస్థపైనా బలంగా పడింది. కుటుంబంలోని వ్యక్తుల మధ్యనున్న రక్తసంబంధాలు కేవలం ఆర్థిక సంబంధాలుగా పరిణామం చెందాయి. కుటుంబ జీవనంలోని నైతిక విలువలు ఆర్థిక విలువల ముందు తలవంచక తప్పలేదు.

ఈ విధంగా కుటుంబ సంబంధాల్లో వచ్చిన పరిణామాల్ని మానవ సంబంధాల్ని నిర్ధారించడంలో ఆర్థిక విలువల-కున్న శక్తిని జగన్నాథశర్మ 'పయనించే ఓ చిలుకా' కథ ద్వారా తెలియజేశాడు. మనిషి కుండే ఉపయోగ విలువ రచయిత దృష్టిలో ఇటు కొడుక్కయినా, అటు కూతురుకైనా ఒక మానవ సంబంధమవుతున్నది. అయితే ఒక తరం మారి తల్లీ బిడ్డల సంబంధం కూడా ఈ ఉపయోగ విలువతో తెగిపోయింది. కానీ, ఈ వ్యాపార విలువల వ్యామోహంలో పడని తరం దానిని అధిగమించి తమలోని మానవీయతను ఆవిష్కరించుకుంటారు.

ఈ కథలో విచ్ఛిన్నమైన కుటుంబ సంబంధాలు 'మట్టి తీగలు' రాలిపోవడాన్ని గమనించవచ్చు. కష్టజీవులు ఎంతో నిర్దాక్షిణ్యమైన జీవన పరీక్షనైనా విలువలు, మానవాను బంధాల పరంగానే పరిష్కరించుకుంటారు. ఆ క్రమంలో 'లాభాలు', ప్రయోజనాలు వదులు కోవాల్సిరావచ్చు. వదులుకోవడం కూడా కాదు. కలుగుతాయనుకున్న సుఖాలేవో వాయిదా పడతాయి. బహుశా జీవితకాలం పాటు కూడా వాయిదా పడొచ్చు. కానీ, వాళ్ళు ఒక మెట్టు మీద ఉంటే కదా కిందపడడానికి. వాళ్ళు మట్టిలోనే ఉన్నారు. కనుక ఎక్కడానికి మెట్లేమీ లేకపోవచ్చు. కానీ, పడిపోవడానికి కూడా వీలుకాని గట్టిమట్టి ఆసరా ఉన్నది వాళ్ళకు. బంగారు తీగల గురించి భ్రమలుంటాయి కాబట్టి భయముంటుంది. మట్టి తీగలకు చిగురు, పిందె, ఆకు, కాయలకు హరిత గుణాన్నిచ్చే జీవలక్షణ మొక్కటే ఉపయోగ విలువ అనే అంశాన్ని ఈ కథలో సుస్పష్టం చేశాడు రచయిత.

## కుటుంబ సంబంధాల చిత్రణ :

**వ్య**క్తికి ఆత్మీయమైన సుఖసంతోషాలు, తుష్టీపుష్టీ చేకూర్చేది కుటుంబవ్యవస్థ. ఇందులో పరస్పర ప్రేమాభిమానాలు, సహాయ సహకారాలు, ఆర్థిక భద్రత, సామాజిక హోదా, లైంగిక వాంఛా పరితృప్తికి తోడ్పడే రాగాను బంధమైన వివాహబంధం లాంటివి ఉంటాయి. ఈ వివాహ బంధానికి ఒక అందం ఉంది. కష్టసుఖాల్లో, ముద్దుముచ్చట్లలో ఒకరికొకరు తోడు నీడగా నిలిచే ఆలుమగలే మానవజాతి మనుగడకు ఆధారభూతులు. వారి నడుమ నడయాడే పిల్లలే 'చిలిపిదేవుళ్లు'. వాళ్లతో గాని ఇంటికి నిండుదనం రాదు. పిల్లలు లేని ఆలుమగలు 'జంట' అనిపించుకుంటారే ఆని కుటుంబం అన్పించుకోలేరు.

సామాన్యంగా హిందూ కుటుంబ వ్యవస్థ సమిష్టి కుటుంబవ్యవస్థ. కుటుంబ సభ్యులుగా రెండు మూడు తరాల వాళ్ళు కలిసి ఉండడం కద్దు. కుటుంబ సభ్యులందరి అవసరాల్నీ గమనిస్తూ అందరిపట్లా సమభావం చూపవలసిన బాధ్యత కుటుంబ పెద్దది. సభ్యులందరి సంపాదనా ఉమ్మడి సొమ్ములోకి వస్తుంది. కష్టసుఖాలన్నిటిలో అందరూ పాలుపంచు కోవలసి ఉంటుంది. ఈ వ్యవస్థలో తమను తాము పోషించుకోలేని వికలాంగులకూ, శక్తి లేని వారికి మాత్రమే కాకుండా వాళ్ల భార్యా బిడ్డలకు కూడా రక్షణ ఉంటుంది. అనేక శతాబ్దాలుగా కొనసాగుతున్న ఈ వ్యవస్థ సామాజిక, రాజకీయ, ఆర్థిక కారణాల వల్ల, నగరీకరణ అభివృద్ధి చెందడం వల్ల ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నమై ప్రత్యేక కుటుంబాలుగా ఏర్పడటం ఈ శతాబ్దంలో ఎక్కువగా కనిపిస్తుంది.

కుటుంబ వ్యవస్థ వ్యక్తికి అపారమైన సాంఘిక మానసిక భద్రతను చేకూరుస్తూ, అతనికి అవసరమైన తాదాత్మ్యతను ఇవ్వగలుగుతుంది. సమాజంలో వివిధ రకాల వ్యక్తులతో ఏవిధంగా ప్రవర్తించాలో, సాంఘిక మర్యాదల్ని శైశవ దశ నుంచీ కుటుంబ శిక్షణ ద్వారా నేర్చుకొని, పరిపూర్ణంగా సామాజిక జీవనాన్ని వ్యక్తి పొందగలుగుతాడు. జగన్నాథశర్మ కథల్లో కుటుంబ జీవితం చాలా ఎక్కువగా ప్రదర్శితమవుతుంది.

ఈ కథల్లో తండ్రీ కొడుకుల సంబంధం, తల్లీ కూతుళ్ల మధ్య ఆప్యాయత, తండ్రీ కూతుళ్ల అనురాగం, భార్యాభర్తల సంబంధాలు అన్నీ కన్పిస్తాయి.

**నాన్నంటే :**

ఉత్తమ పురుషలో నడిచిన ఇతివృత్తమిది. కుటుంబ సంబంధాల్ని చిత్రించిన కథ ఇది. ఈ కథలో కథానాయకుడు తన తండ్రిని తలచుకొని తల్లడిల్లిపోవడం కన్పిస్తుంది.

కథా నాయకుడు పుట్టిన మూడేళ్ల వరకూ అతని తండ్రి మంచిగా ఉండేవాడు. దగ్గరుండి వ్యవసాయం చూసుకునేవాడు. ఇంటి పట్టునుండేవాడు. పెరట్లో పొట్లపాదును వేశాడు. మల్లె మొక్కల్ని నాటేవాడు. ముద్దబంతి పూలనడుమ వొద్దికగా నిలిచేవాడు.

వ్యవసాయంతో పాటు ఏజెన్సీ ప్రాంతాల్లో కథానాయకుడి తండ్రి వ్యాపారం చేసేవాడు. ఆ వ్యాపారంలో నష్టం వచ్చింది. కథా నాయకుడి తండ్రి సిద్ధాంతాల కోసం జీవించేవాడు. దాంతో అప్పుడప్పుడూ పోలీసులు ఇంటిపై దాడిచేసేవారు. ఎందుకు లొక్కుపోయారని అడిగితే కథానాయకుడి తల్లి ఏవో కారణాలు చెప్పేది.

అస్తినంతటినీ అమ్మి కాకుల బారి నుంచీ నాన్నని రక్షించు కుందామనుకున్నదామె. దానికోసం వీళ్ళని, వాళ్ళని సంప్రదించింది కూడా ! కానీ, ఈలోపు కథానాయకుడి తండ్రి కొండల్లోకి పారిపోయాడు. అప్పుడు కథానాయకుడి వయసు ఐదేళ్లు. అప్పుడప్పుడూ దొంగచాటుగా ఆయన ఇంటికివచ్చి పిల్లల్ని చూసుకునేవాడు. కథానాయకుడి తండ్రి ఓ జ్ఞాపకంలా మిగిలిపోయాడు. ఒకరోజు చీకటి పడుతుండగా ముగ్గురు వ్యక్తులు ఇంటి దగ్గరకు వచ్చారు. కథానాయకుడి తండ్రి తుపాకీ తూటాలకు బలయిపోయాడన్నారు.

కథానాయకుడికి ఏడవాలనిపించలేదు. ఏడేడు లోకాల్లోనున్న నాన్నని వెతికి పట్టుకోవాలనిపించింది.

ఏ అర్థరాత్రో వచ్చి ముద్దిచ్చి ఆవాసనని కొడుక్కి కానుకగా అందించి, ఖాకీల చేతుల్లో చచ్చిపోయే తండ్రి కథ ఇది. కుటుంబ సంబంధాల్లోని సున్నితమైన కోణాన్ని ఈ కథ చాలా చక్కగా ఆవిష్కరించింది.

**పేగు కాలిన వాసన :**

ఈ కథ కూడా ఉత్తమ పురుషలోనే నడిచింది. కుటుంబ సంబంధాల్ని వివరించిన కథ ఇది. ఇది ఒక జట్కా నడిపే యువకుడి మానసిక పరివర్తన గుర్తించిన కథ.

రంపంతో దుంగలు కోస్తూ తన తండ్రి కుడిచేతివేలు తెగ్గొట్టుకొని, యజమాని దయతో ఇచ్చిన నష్టపరిహారాన్ని తనచదువు కోసం వినియోగించడం, రోజంతా రంపపు పొట్టు కూరుతూ తన తల్లి అనారోగ్యానికి గురికావడం, తన అక్క దుంగల మధ్య పనిచేస్తూ పాము కాటుకు గురికావడం, వీటన్నిటికీ కారణమైన యజమానినీ, ఆ ఊరి పరిస్థితుల్నీ తప్పించుకుని, పై చదువు వద్దనుకుని పొరుగూరికి వెళ్లిపోయి, అక్కడ జట్కా నడుపుతుండగా, ఒకసారి వేలు తెగిఉన్న ముసలతన్ని తన జట్కాలో ఎక్కినపుడు చూశాక తన తండ్రీ, తల్లీ, అక్కా గుర్తొచ్చి తన కుటుంబ సభ్యుల్ని రక్షించుకోవాలన్న తపనతో తన ఊరికి తిరిగి ప్రయాణమవుతాడు.

తన బతుకును మెరుగు పరచుకోవడం కన్నా పేగు బంధం గొప్పదనీ, కుటుంబాన్ని ఆదుకోవడం ముఖ్యమని గ్రహిస్తాడు. ఇది జట్కా నడిపే యువకుడు స్వయంగా తన కథ చెప్పుకుంటున్నట్లు జగన్నాథ శర్మ రాసిన కథ.

**మళ్లీ ఖాళీ ఆకాశం :**

కుటుంబ సంబంధాల్ని చిత్రించిన కథ ఇది. చిన్నప్పుడు ఎప్పుడో తప్పిపోయిన కొడుకు గురించి తల్లిదండ్రులు పడే మానసిక క్షోభ, వేదన ఈ కథలో కరుణ రసాత్మకంగా ఆవిష్కృతమయ్యాయి.

జగన్నాథం, సుందరి భార్యాభర్తలు. వీళ్లకు ఇద్దరు కొడుకులు. జగన్నాథం సంసారం సజావుగా సాగిపోయింది. ఆలయంలో అర్చకత్వం మీద ఆ కుటుంబం ఆలనా పాలనా జరిగిపోయేది.

ఫిఫ్తఫారం చదువుతూ, చదువు మీద శ్రద్ధ కనబరచక సినిమాల మీద ఆసక్తిని పెంచుకొనే పెద్ద కొడుకు పేర్రాజును జగన్నాథం ఓరోజు తీవ్రంగా దండించాడు. దాంతో పేర్రాజు ఇంట్లోంచి పారిపోయాడు. అప్పటి నుంచీ సుందరి మతిస్థిమితం కోల్పోయింది. మతి కోల్పోయిన భార్యను భర్తలాగాక, తండ్రిలా ఆదరించి సేవలు చేసేవాడు జగన్నాథం.

రెండో కొడుకు వాసుకు పెళ్ళయి, కోడలు కాపురానికి వచ్చింది. ఆమె మొదట్లో అత్తగారిని బాగా చూసుకున్నా ఆ తర్వాత ఈసడించుకోసాగింది. వాసుకు చెబితే అతడూ భార్యకే వంతపాడాడు. దీంతో జగన్నాథం ఇంట్లోంచి బయటకు వచ్చేశాడు. వాసుని పేర్రాజుని బేరీజు వేసుకున్నాడు. చెయ్యెత్తితే పేర్రాజు తనని ఎదిరించలేదు. పారిపోయాడు. వాసయితే ఎదురుతిరిగాడు. దీంతో ఏడెనిమిదేళ్లుగా లోలోతుల్లో దాచిన పేర్రాజుపై ప్రేమను వెలికి తెచ్చుకున్నాడు జగన్నాథం.

పేర్రాజు ఎక్కడో హైదరాబాదులో ఉన్నాడంటే భార్యను తీసుకొని హైదరాబాదు వచ్చాడు జగన్నాథం. ఒక రాజకీయ నాయకుడు తనకు మంత్రి పదవి రావాలని ప్రజలందరినీ తీసుకొని హైదరాబాదు వచ్చాడు. జగన్నాథం కూడా వాళ్ల బస్సులోనే హైదరాబాదు చేరుకున్నాడు. ముఖ్యమంత్రి ఇంటిముందు వేలసంఖ్యలో తరలించబడ్డ జనం గుమిగూడారు. ఆ జనంలో సుందరిని ఓ కంట కనిపెడుతూ, మరోకంట పేర్రాజును అన్వేషిస్తున్నాడు జగన్నాథం. ఎదురైన ప్రతి వ్యక్తిలోనూ కొడుకుని గుర్తించడంలో ప్రయాసపడుతున్నాడు. అంతలో ఉన్నట్టుండి ఊరేగింపులో దొమ్మీ ప్రారంభమైంది. గొడవలు జరిగాయి. ఒకర్నొకరు నెట్టుకుంటూ తొక్కుకుంటూ పోయారు. జగన్నాథం చేతిలో నుండి సుందరి తప్పుకుంది. ముందుకీ వెనక్కీ పరుగులు తీశాడు. ఆమె జాడలేదు. కథ మొదటికొచ్చింది.

కొడుకుని వెదకాలని వచ్చి భార్యను పోగొట్టుకున్న అభాగ్యుడు జగన్నాథం. కుటుంబ సంబంధాల్లోని మాధ్యుర్యాన్ని చవి చూపిన కథ ఇది.

**చుక్కెదురు :**

కుటుంబ సంబంధాలు ఆర్థిక దుస్థితి వల్ల ఎలా ఛిద్రమైపోతాయో ఈ కథ చాలా చక్కగా వివరించింది. వృత్తి సమస్యను కూడా ఈ కథ చిత్రించింది.

శాస్త్రిగారికి మళ్లు లేవు, మాన్యాలులేవు. కులవృత్తి జంధ్యాలను వడకడమే. స్త్రీలు వొత్తులు చేస్తారు. మగవాళ్లు జంధ్యాలు వడుకుతారు. సంప్రదాయం మనగలుతూంటే అప్పుడప్పుడూ నోటికి నాలుగు వేళ్ళూ పోతున్నాయి. అలా పోని రోజున ఊరు విడిచి పోదామంటే మరో వృత్తి చేతకాదు. అందుకే.... గోదావరీ తీరాన్ని, అగ్రహారాన్ని విడిచి పెట్టడు శాస్త్రి. కానీ సంపాదన అంతంత మాత్రమే.

శాస్త్రికి పదేళ్లప్పుడు చాలా కోరికలుండేవి. ఇరవైఏళ్ల వయసు నాటికి ఆ కోరికల్లో సగానికి సగం తగ్గించుకొన్నాడు. ముప్పై ఏళ్లనాటికి మిగిలిన సగంలో సగ భాగం కోరికలు తీరనివి అని నిర్ణయించుకున్నాడు. నలభై ఏళ్లనాటికి కోరికల్ని చంపుకున్నాడు. అయినా... చింత చిగురు పప్పు అన్నంలో సువర్ణరేఖ మామిడిపండు నంజుకు తినాలని, పాపకి పట్టులంగా కుట్టించాలని, బాబుకి గాలి పటం కొనిపెట్టి గోదావరి ఒడ్డున ఆకాశ మార్గాన అది ఎగురుతూ తిరుగుతుంటే, బాబు గంతులేస్తుంటే చూడాలని, పాప, బాబు పడుకొన్న తర్వాత జంధ్యాన్ని గాయత్రి మెడలో కూడా వేసి, వళ్లోనికి ఆమెని లాక్కొని, తాతల నాటి బూరుగుదూది పరుపు మీద సుఖించాలని చిన్న చిన్న కోరికలున్నాయి. అతనిలో ఇవి సాధారణ కోరికలు కాని అవి తీరకుండానే చనిపోతాననుకున్నాడు శాస్త్రి. కోరికలు తీరవని తెలిస్తే వందల జంధ్యాలని తాడులా పేని ఉరి పోసుకొని ఆత్మహత్య చేసుకోవాలని కూడా అనుకున్నాడు.

ఇంతలో ధర్మకర్త రామనాథం చనిపోయాడని తెలుసుకొని చావురేవు దగ్గరకు గబగబా పరుగెత్తాడు శాస్త్రి. ముప్పై జంధ్యాలు




ఖర్చయ్యాయి. ముప్పైఅయిదు రూపాయలొచ్చాయి. శాస్త్రి సంతోషం పట్టలేకపోయాడు. చింత చిగురు పప్పు వండించాడు. గాలి పటాలు తెచ్చాడు. మామిడి పండ్లు కొన్నాడు. మల్లెపూలతో పాపకు జడవేయించాడు. ఇంట్లో పండుగలా ఉంది. పిల్లలిద్దరూ నిద్రపోయాక బూరుగు పత్తి పరుపు వేయమన్నాడు భార్యని. ఆమె గుండె గతుక్కుమంది. ఎవరో లక్షవొత్తుల నోము కోసం వొత్తులు కావాలని అడిగితే గాయత్రి పత్తిని తీసి వొత్తులుగా చేసింది. పిల్లల ఆకలి తీర్చడానికి ఇంతకంటే గత్యంతరం లేక ఆ పని చేసిందని తెలుసుకొని భార్యను గుండెలకు హత్తుకున్నాడు శాస్త్రి.

ఒక పేద బ్రాహ్మడికి చిన్న చిన్న కోరికలు కూడా గొంతమ్మ కోరికల్లా ఎలా అవుతాయో, భార్యా పిల్లల మీద ప్రేమ చూపించడం కూడా ఎలా గగన మవుతుందో ఈ కథలో చూపిస్తాడు రచయిత.

**పయనించే ఓ చిలుకా :**

వృద్ధాప్య సమస్యల్ని చిత్రించిన కథ ఇది. చివరి దాకా తమ ఆలనా పాలనా చూస్తారనుకున్న పిల్లలు, తమల్ని వృద్ధాప్యంలో హీనంగా చూస్తే తల్లిదండ్రుల హృదయాలు ఎంతగా తల్లడిల్లిపోతాయో అత్యంత హృద్యంగా ఈ కథ చిత్రించింది.

కళ్యాణి ఓ వృద్ధురాలు. ఆమెకు ఇద్దరు కొడుకులు. పెళ్లిళ్లయి వాళ్లంతా ఉన్నతోద్యోగాల్లో స్థిరపడ్డారు. కళ్యాణి భర్తపోయిన తర్వాత ఒంటిదయ్యింది. పిల్లలు వంతుల వారీగా ఆమె పోషణను పంచుకున్నారు. కోడళ్లు ఈమెను పురుగులాగా చూసేవారు. పెద్ద కోడలు మహిళా మండలి కోశాధికారి. ఇంట్లో ఎప్పుడూ ఉండదు. ఉన్నా అత్తను సూటిపోటీ మాటలతో చిత్ర హింసలు పెట్టేది. పోనీ రెండో కోడలు దగ్గరకు వెళదామంటే అక్కడా అంతే ! పెనం మీంచి పొయ్యిలో పడ్డట్టుగా ఉంటుంది. ఇలా ఎంతకాలం? ఈ సూటి పోటీ మాటలూ, ఈ కష్టాలు ఎన్నాళ్లు? దేవుడు కరుణించి వేగంగా చావొస్తే బాగుణ్ణనుకొనేది.

ఇలా భయం భయంగా జీవితాన్ని నెట్టుకొస్తుంటే కళ్యాణికి ఓ రోజు ఉత్తరమొకటి వచ్చింది. అది తన మిత్రుడైన జగన్నాథం రాసింది.

జగన్నాథం ఆ రోజుల్లో కళ్యాణిని ప్రేమించాడు. కానీ, ఆస్తులు, అంతస్తులూ అడ్డొచ్చి వాళ్ల ప్రేమ దూరమయ్యింది. తర్వాత కళ్యాణికి వేరొకరితో, జగన్నాథానికి మరొకరితో వివాహమైపోయింది. జగన్నాథంకు ఇద్దరు కూతుళ్లు. భార్య చనిపోయింది. అళ్ళుళ్ళిద్దరూ జగన్నాథాన్ని చాలా హీనంగా చూసేవారు. ఈ సమయంలోనే జగన్నాథానికి నిజమైన తోడు అవసరమైయింది. అందుకే కళ్యాణిని తన దగ్గరకు వచ్చేయమని ఉత్తరం రాశాడు.

పైగా అలా వచ్చేయడం పాపమూ కాదు, తప్పు అంతకన్నా కాదు. చనిపోయిన ఆమె భర్తకు చేసిన ద్రోహం కూడా ఏమీ ఉండదు. ఇక సంప్రదాయం చాలా హీనమైంది. మనిషిని మనిషిగా జీవింపచేయని సంప్రదాయం అనవసరమని కూడా రాశాడు.

తన అభిప్రాయం తప్పయితే ఉత్తరాన్ని చించేయమని, ఒప్పయితే వచ్చేయమని రాశాడు. కళ్యాణి బాగా ఆలోచించింది. వెళ్ళడానికి నిశ్చయించుకుంది.

ముదుసలి వయసులో ఒకరి తోడు ఒకరికి కావాలి. ఒకరి ఓదార్పు మరొకరికి కావాలి. అవన్నీ అందించే తోడు కోసం ఎంతగా తపించిపోతారో ఈ కథ తెలియజేస్తుంది.

**విశ్లేషణ :** మానవ జీవితంలోని విషాదాన్ని వ్యక్తీకరించడానికి కథ కాన్వాస్ చిన్నదే అయినా, ప్రతిభావంతులైన రచయితలు ఆ పరిధిలోనే హృదయాన్ని పట్టి కుదిపేలా కథ చెబుతారు. విషాదాలు వైఫల్యాలు వెంటాడినంతగా సుఖప్రదమైన ముగింపులు, పేలవమైన పరిష్కారాలు పాఠకుల హృదయాలను తాకలేవు. జీవితంలోని ఆనందకరమైన సన్నివేశాలకన్నా వైఫల్యాలు, అపజయాలు వాటి తాలుకు జ్ఞాపకాలు, విషాదకరమైన ఘట్టాలు మాత్రమే పదే పదే మనల్ని వెంటాడి వేధిస్తాయి. జీవితాన్ని తాత్త్విక దృష్టితో చూసిన రచయితలు ఈ సత్యాన్ని గ్రహిస్తారు. అలాంటి వారే తమ రచనల ద్వారా మానవ జీవిత విషాదాల్ని బలంగా పట్టిచూపుతారు. సరిగ్గా ఆ కోవకు చెందిన రచయితే జగన్నాథశర్మ. కథల ద్వారా జీవితంలోని విభిన్న పార్శ్వాలను సృజనాత్మకంగా ఆయన వ్యక్తీకరించిన తీరు అసామాన్యమైంది.

మనిషి జీవితం అనేకానేక మలుపులతో సమ్మిశ్రితమైంది. విభిన్న సమయాల్లో విలక్షణమైన రీతిలో స్పందించడం అతని నైజం మనిషి అంతరంగం కూడా అంతే. ఏకకాలంలో మనిషి వెయ్యి రూపాలతో సంచరిస్తాడు. వైరుధ్యాలు, వైవిధ్యాలు సహజం. ఈ రకమైన మానవ స్వభావాన్ని అర్థం చేసుకొన్నప్పుడే ఎవరైనా ఉదాత్తమైన రచనలు చేయగలుగుతారు. అలాంటి రచనలే నాలుగు కాలాల పాటు నిలిచి చదివిస్తాయి. పెద్దిభొట్ల కథలను అందుకే ఇవాల్టికి పాఠకులు చదువుతారు. ఈ తరం పాఠకులు సైతం ఆయన కథల్ని ఆదరిస్తారు. ఆయన కథల ప్రవాహంలో పడి కొట్టుకుపోతారు. ఆయనకథలు చదివినపుడు ఏవో తెలియని దిగులు తెరలు మనల్ని అలుముకుంటాయి. గుండెల్ని బరువెక్కిస్తాయి. మనకు తెలియకుండానే ఆ పాత్రల స్వభావాన్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో వాటిపట్ల మమకారం పెంచుకుంటాం. ఈ క్రమంలో ఆ పాత్రల విషాదానందాలు మనల్ని అంటిపెట్టుకుంటాయి. ఇందుకు ఉదాహంణగా జగన్నాథశర్మ కథల్ని చెప్పుకోవచ్చు.

రచయిత జీవితాన్ని సమగ్రంగా ప్రదర్శించే తీరు ఈ కథలన్నింటిలో అంతర్లీనంగా కనిపించడం యాదృచ్ఛికం, కాదు. వ్యవస్థ మార్పులోనే సమస్యలు సమసిపోతాయన్న భ్రమలు రచయితకు లేవు. వ్యవస్థలో మార్పురావాలని ఆయన అభిలషిస్తాడు. అయితే వ్యక్తులు తమ పరిధిలో తాము మారుతూ మార్పుకు దోహద పడాలన్నది ఆయన విశ్వాసం. అందుకు అనుగుణంగానే ఆయన కథారచన సాగుతుంది. అందువల్లనే ఆయన కథలు మనసుల్ని హత్తుకుంటాయి. ఆలోచింపజేస్తాయి.



# కవిత

## మరణానికి పరిమళమద్దీ

స్ఫూర్తి
9490098694

మరణించడమంటే ఉనికిని కోల్పోవడం కాదు
నూతన తరానికి తొలి అడుగవడం
జీవితాంతం ఏరుకున్న అనుభవాల పూలను
నూతనత్వానికి అలంకరించి ఆహ్వానం పలకడం
వెలుగు పూలను దోసిళ్ళలో కోసుకొచ్చి
పసిపిల్లల పాదాల ముందు చల్లడం



నిప్పును చేసిన ఆదిమానవుడి అడుగుల్లోనే కదా
మనం అడుగులేసి నడిచింది
ఆకలిలో ఆనందంలో
అరిసిన అరుపుల్లోంచి పుట్టిన
అక్షరాల విజ్ఞానంలోనే మనమూ సేదతీరింది
అనంత విశ్వాన్నీ జయించే
ప్రతి అడుగులో కనిపించేవి
ఉమ్మడి తనపు జాడలే

వ్యక్తి జీవితం ఎల్లప్పుడూ సామూహికమే
సామాజిక సంబంధాలకు మానవ శ్రమే పునాదయినపుడు
మరణం కూడా దండలో పూవులాంటిదే
పూవు రాలిపోయిన దండలో కొత్తవి చేరినట్లే
ఉమ్మడి తనంలోనే మనిషి మనిషిగా మిగులుతాడు

అయినా,
చావు అనివార్యమైనపుడు భయమెందుకు
సూర్యుడి కిరణాలను పట్టుకొని వేలాడేవారికి
వెలుగుకు కరువేముంది
నిండు చంద్రుణ్ణి ఇంటి దీపం చేసుకున్నవారికి
చీకటితో భయమేముంది
అస్తమించే సూర్యుడు కూడా
రాత్రి చంద్రుడిని వాగ్దానం చేసినట్లే
బ్రతికినంత కాలం పరిమళాలను
వెదజల్లడమే జీవితం !
ఎదుటివారి నవ్వుల్లో
తన నవ్వును చూసుకోవడమే జీవితం !!

## వర్తమాన భారతం

పులి జమున
8500169682

అరవై ఆరేళ్ళ స్వతంత్ర్య భారతమా !
నీ చుట్టూ సమస్యల వలయం
అడుగడుగున అవినీతి రాజ్యం
చిత్తశుద్ధి కనుమరుగైన రాజకీయం
ప్రజల కోసమంటూ ప్రవేశ పెడుతున్న
సంక్షేమ పథకాలు
భారీ కుంభకోణాలకు ద్వారాలు
సర్వాంతర్యామిలా అంతటా
అవినీతి విశ్వరూపమే
దేశానికి రైతు వెన్నెముక ఆదర్శనినాదం
ఆచరణలో అది మృత్యునాదం
గిట్టుబాటు ధర దక్కని ప్రభుత్వ విధానాలు
పంట నోటి కందకుండా చేస్తున్న ప్రకృతి వైపరీత్యాలు
ఫలితం రైతన్నల ఆత్మహత్యలు
రెక్కాడినా డొక్కనిండని
నేతన్నల ఆకలి చావులు
అధిక ధరలతో అతలాకుతలమవుతున్న జనజీవితాలు
గోటి చుట్టుపై రోకటి పోటులా కరెంట్ మోతలు
పసిపాపల నుండి పండు ముదుసళ్ళ వరకు
ఆడతనంపై అమానుష కృత్యాల పరంపరలు
ఆడవారి జీవితాలు గాలిలో దీపాలు



చట్టాలు నేరస్థుల చుట్టాలై
స్వేచ్ఛను ప్రసాదిస్తున్న వైనాలు
అభద్రత, క్షణం, క్షణం బతుకు భయం
చావలేక బతకలేక నికృష్ట స్థితిలో సమాజం
అభివృద్ధి చెందిన క్రమంలోనే
అనాగరిక సమాజానికి బాటలు వేస్తున్నాడు మనిషి
సమాజం ప్రగతి పథంలో పయనించాలంటే
మారుతున్న కాలం వెంట పయనించి
మారని చట్టాలను
గాడీ తప్పుతున్న ప్రభుత్వ విధానాలను
మార్చుకుని ముందడుగువేయాలి
అందుకు కవులు నడుం బిగించాలి
కవులారా ! మీరు వ్యక్తులు కాదు శక్తులు
కలాలను పదును పెట్టడానికి ఉద్యుక్తులు కండి
మేథోమథనంతో సాహితీ వ్యవసాయం చేయండి
సంస్కార బీజాలు నాటి మానవత్వాన్ని పెంచండి
మానవ మస్తిష్కాలలోని బూజును దులపండి
మానవ సంబంధాల సుమసౌరభాలను
సమాజంలో పరిమళింప చేయండి.



# విలక్షణ అనువాదకుడు ఆలూరి

చెరుకూరి సత్యనారాయణ
9848664587

నిన్న మొన్నటి వరకూ గుంటూరులో జరిగే ఏ సాహిత్య కార్యక్రమంలోనైనా- దూరంగా తమదైన లోకంలో విహరిస్తూ కూర్చొనే వృద్ధజంట ఒకటి కనిపించేది. అది ఆలూరి భుజంగరావు - లలితమ్మ జంట. వారు తెలిసినవారిని ఆప్యాయంగా పలకరిస్తూ మాట్లాడేవారు. సభ చివరి వరకూ ఉపన్యాసాలు వింటూ కూర్చునేవారు. వారు శ్రీశ్రీ వర్ధంతి రోజున గుంటూరులో ఒక వీధికి 'మహాకవి శ్రీశ్రీ' అని పేరు పెట్టి- ఒక కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఆరోగ్యం సహకరించకపోయినా ఆసాంతం ఉన్నారు. తరువాత మా సహ న్యాయవాది సాయిబాబు కార్లో వారిని ఇంటికి పంపించాను.

20.06.2013 తెల్లవారుజామున పెనుగొండ లక్ష్మీనారాయణ ఫోను. ఆలూరి భుజంగరావు కన్నుమూశారని దాని సారాంశం. నాకు ఆయనతో ఉన్న పరిచయంతో గతమంతా కళ్ళముందు పరుచుకుంది.

తెలుగు సాహిత్యం పట్ల అభిరుచి ఉన్న పాఠకుల్లో గానీ, వామపక్ష ఉద్యమాల్లో అభినివేశం ఉన్న యువకుల్లో గానీ- రాహుల్ సాంకృత్యాయన్ జయయౌదేయ, విస్మృత యాత్రికుడ, దివోదాసు, దర్శన్- దిగ్దర్శన్ లాంటి రచనలు చదవనివారు అరుదు. ఆ రచనలను హిందీ నుంచి తెలుగులోకి భుజంగరావే అనువదించారు. అలాగే భగత్‌సింగ్‌ని కేంద్రంగా తీసుకొని ఆయన సహచరుడు యశ్‌పాల్ రాసిన చరిత్రని 'సింహావలోకనం' పేరుతో తెలుగులోకి అనువదించాడు. ఇంకా ప్రేమ్‌చంద్ నోరా, గబన్, రంగభూమి, కిషన్‌చందర్ వాయుగుండం, పరాజయం నవలలను తర్జుమా చేశాడు. అయితే, పాఠకులు ఈ మూల రచయితలను గుర్తుంచుకున్నట్టుగా- అనువాదకుడిని గుర్తు పెట్టుకోకపోవడం బాధాకరమే! ప్రసిద్ధుల హిందీ రచనలు తెలుగులోకి అనువదించటమే కాక, విరసంలో చేరిన తరువాత వారి సాహిత్యాన్ని కొన్ని నవలలు (రాగో), కథలు(నేలతల్లి విముక్తి కోసం..., అల్లం రాజయ్య అతడు, బొగ్గు పొరల్లో...) హిందీలోకి అనువాదం చేశాడు. స్వయంగా అనేక సృజనాత్మక రచనలు కూడా చేశాడు. ప్రజలు అజేయులు, కొండవాగు నవలలు; అరణ్యపర్వం పేరుతో కథలు రాశాడు. ఇంకా ఆయన వెలువరించిన వాటిలో సాహిత్య బాటసారి శారద, గమ్యం దిశగా గమనం, గమనాగమనం... ముఖ్య రచనలు.

భుజంగరావు 1928లో గుంటూరు జిల్లా పొన్నూరులో పుట్టి, 12 ఏళ్ల వయసు వరకూ అక్కడే పెరిగాడు. చిన్నప్పటినుంచి దుర్భర దారిద్ర్యం అనుభవించారు. గుంటూరు, బెజవాడ, బాపట్ల, చేబ్రోలు, తెనాలి మొదలైన చోట్ల హోటల్ కార్మికుడిగా పనిచేశాడు. రెండు ఇడ్లీలు అణాకు, అట్టు అణా, కాఫీ బేడకు (మూడు పైసలకు) అమ్మే రోజులవి. ఆ సమయంలోనే శారద (నటరాజన్), రావూరి భరద్వాజలతో స్నేహం కుదిరింది. దానివల్ల ఆకలి తీరకపోయినా అందరి సాహిత్య కృషులూ ఇనుమడించాయి. వీరంతా 'అరేయ్', 'ఒరేయ్', 'బావా' అని పిలుచుకుంటూ ఎంతో సఖ్యంగా, స్నేహంగా ఉండేవారు. 'పాలడబ్బాడు బియ్యం సంపాదించి, వండటానికి పుల్లలు లేక, సినిమా పోస్టర్లు మడతపెట్టి, వాటి మంటతో వండుకొని, కాసిని పచ్చి మిరపకాయలు కసావిసా నమిలి, మంటెత్తినప్పుడు నాలుగు చెంబుల మంచినీళ్ళు తాగి, ఆ గుటక వేయటానికి ముందు ఒక ముద్ద అన్నం నములుతూ కడుపు నిండినంత ఆనందంతో కథలు చెప్పుకున్న రోజులవి...' అని రావూరి భరద్వాజ ఈ మధ్యనే గుర్తు తెచ్చుకున్నారు. అణాతో కాఫీ తెప్పించుకొని ఉచితంగా పెట్టే కారాతో కడుపు నింపుకొని అన్నం తిన్నంత హాయిని అనుభవించేవాళ్ళు.

శారద బంధువు రాఘవమ్మ చదువుతున్న హిందీ మాస్టారి దగ్గర భుజంగరావు కూడా హిందీ నేర్చుకున్నాడు. తరువాత ఆ పరీక్ష పాసై టీచరుగా స్థిరపడ్డాడు. తొలుత సత్యవతిని, ఆమె మరణానంతరం లలితను వివాహం చేసుకొని నలుగురు ఆడపిల్లలకు, ఒక మగపిల్లవాడికి తండ్రయ్యాడు. టీచరుగానూ, రిటైరయ్యాక- కొదమగుండ్ల, యడవల్లి, పిటకవగుళ్ల, గుడివాడ, ఉయ్యూరు, గుల్బర్గా, షాహాబాద్, గుంటూరుల్లో జీవించాడు. గాడిబావి సెంటర్లో, రణరంగ చౌక్‌లో, పార్టీ ఆఫీసు మీదా రెపరెపలాడే ఎర్రజెండా తమకెంతో దన్నుగా ఉండేదని రాసుకున్నాడు. 1955 మధ్యంతర ఎన్నికల్లో పృథ్వీసింగ్ తదితర ఉత్తరాది నాయకుల ఉపన్యాసాలను తర్జుమా చేస్తూ రాష్ట్రమంతా తిరిగాడు. తరిమెల నాగిరెడ్డిగా భ్రమపడి స్వాగతం చెప్పిన పెదపాలెం గ్రామస్తులకు తాను కాదని చెప్పటానికి కష్టపడ్డాడు. 85 సంవత్సరాల వయసులో గుంటూరులో మరణించేవరకూ కమ్యూనిస్టు ఆదర్శాలతో జీవించాడు. తన పిల్లలను కూడా అలాగే పెంచాడు.

ఆయన తన వ్యక్తిగత జీవితమూ, సాహిత్య కృషీ ఎంతో నిబద్ధతతో సాగించాడు. ఎన్నో కష్టాలను, నష్టాలను ఎదుర్కొని కమ్యూనిస్టుగానే జీవించాడు. 'ఎర్రజెండాలు రెపరెపలాడుతూ ఆ అరుణకాంతులు మాకు మానసికంగా, శారీరకంగా ఎంతో ధైర్యాన్ని, ఉత్సాహాన్నీ ఇచ్చేవి.' అని సగర్వంగా చెప్పుకున్నాడు. ఈ ధైర్యమూ స్ఫూర్తే వారిని చివరి వరకూ కమ్యూనిస్టులుగా బతికేలా చేసింది.

## వర్తమానం

### పెట్టుబడిదారీ వ్యవస్థ వికృత రూపం

# చాకిరీ కూపాల్లో బానిస బతుకులు

- అర్చనాప్రసాద్



బంగ్లాదేశ్‌లోని సవార్‌లో ఎనిమిదంతస్తుల రాణా భవనం కూలిపోవటంతో దుస్తుల కర్మాగారంలో పనిచేసే 1,127 మంది కార్మికులు చనిపోయారు. పెద్ద రిటైల్ కంపెనీలకు చెందిన అనేక చాకిరీ కూపాలు (స్వెట్ షాపులు) ఈ భవనంలో ఉన్నాయి. అత్యంత దుర్భర పరిస్థితులలో కఠోర శ్రమ చేసే 3,000 మంది కార్మికులు వీటిలో పనిచేస్తున్నారు. ఒక్క బంగ్లాదేశ్‌లోనే 4,825 దుస్తుల కార్మాగారాల్లో 35 లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు. వీరిలో 85 శాతం మంది మహిళలు, పిల్లలు. వాల్‌మార్ట్, పిక్ మార్క్, మ్యాంగో, ఇతర ఐరోపా, అమెరికా బ్రాండ్‌ల దుస్తుల తయారీ దిగ్గజాల గొలుసులో వీరంతా అట్టడుగున ఉంటారు.

**చాకిరీ కూపాల శ్రమ – పెట్టుబడిదారీ విధాన విస్తరణ :** అయితే ఇలాంటి చాకిరీ కూపాలున్న దేశం బంగ్లాదేశ్ ఒక్కటే కాదు. ఎలక్ట్రానిక్స్, రెడీమేడ్ దుస్తుల వ్యాపారం చేసే రిటైల్ దిగ్గజాలకు చౌకైన శ్రమను, ఉత్పత్తి సౌకర్యాలను దాదాపు అన్ని వర్ధమాన దేశాలూ సమకూరుస్తున్నాయి. ప్రపంచ ఫ్యాషన్, రెడీమేడ్ దుస్తుల రిటైల్ పరిశ్రమ అభివృద్ధికి ఈ దేశాలు గణనీయంగా తోడ్పడటమేగాక వీటి ఎగుమతులలో అధిక శాతం ఈ ఉత్పత్తులు ఉన్నాయి. ఉదాహరణకు బంగ్లాదేశ్ నుంచి ఎగుమతి అయ్యే అన్ని ఉత్పత్తులలో 80 శాతం వరకూ రెడీమేడ్ దుస్తులే ఉంటాయి. ఇక్కడ మొత్తం శ్రామికుల్లో మహిళలు, పిల్లలు 85 శాతం వరకూ ఉంటారు. వీరికి కనీసం జీవించేందుకు అవసరమైన వేతనం కూడా ఇవ్వటం లేదు. ఈ పరిస్థితి బంగ్లాదేశ్‌కే పరిమితం కాలేదు. ఇది భారతదేశం లాంటి ఇతర అభివృద్ధి చెందుతన్న దేశాలలో కూడా ఉంది. ఈ దేశాలలో చౌకగా దొరికే శ్రమను ఉపయోగించుకోవడానికి బహుళ జాతి కంపెనీలు తమ కార్యకలాపాలను అవుట్ సోర్సింగ్ చేసుకుంటున్నాయి. కాబట్టి 1990ల తరువాత ప్రపంచ వ్యాప్తంగా 'చాకిరీ కూపాల శ్రమ' పునరావిర్భవించింది. ప్రస్తుత కార్పొరేట్ పెట్టుబడిదారీ విధాన పునరుత్పత్తికి ఇది అత్యంత కీలకం. 'చాకిరీ కూపాలు'గా పేర్కొనబడే ఫ్యాక్టరీలు, వర్కుషాపులు జాతీయ, అంతర్జాతీయ శ్రామిక ప్రమాణాలను పాటించవు. ఈ స్థలాలలో శ్రామికులు అత్యంత అమానవీయ పని పరిస్థితులలో తక్కువ జీతాలకు ఎక్కువ పని గంటలు (ఓవర్ టైం) పనిచేస్తూ ఉంటారు. కొద్ది సంఖ్యలో ఉన్న గుత్త సంస్థల లాభార్జనకు మిగులును ఉత్పత్తి చేయటం కోసం శ్రామికులు నిర్బంధానికి గురవుతున్నారని దీనర్థం.

"కార్ల్‌మార్క్స్ తన 'పెట్టుబడి' (1867) గ్రంథం మొదటి భాగంలో ఈ ధోరణి గురించి వివరించారు. ఆయన విశ్లేషణ ప్రకారం పనిదినాన్ని పెంచటం (పెట్టుబడి శ్రమశక్తిని వినియోగించుకునే కాలం) అనేది మిగులు శ్రమ దోపిడీ యొక్క మౌలిక రూపం. ఆదిమ 'చాకిరి కూపాలు' దుస్తుల తయారీ ఫ్యాక్టరీలు, కుండలు, లేస్‌ల కర్మాగారాల్లో 19వ శతాబ్దంలో బ్రిటన్‌లో ప్రారంభమయ్యాయి. లేస్‌ల, కుండల కర్మాగారాల్లోని స్థితిగతులను మార్క్స్ స్వయంగా నమోదు చేశారు. ఈ కర్మాగారాల్లో 7–10 సంవత్సరాల వయస్సున్న పిల్లలను తెల్లవారుజామున 4–5 గంటలకు లేపి రాత్రి 9–10 గంటల దాకా పని చేయించేవాళ్ళు. మధ్యలో భోజనానికి ఒక అరగంట విరామం ఉండేది. అలాంటి దోపిడీని అరికట్టే చట్టపర నిబంధనలేవీ ఉండేవి కావు. పెట్టుబడి మరింతగా దోపిడీ చేయడానికి, దాని పలుకుబడి పెంచుకోవడానికి పరిస్థితులు అనుకూలంగా ఉండేవి. ఇంగ్లాండులో ఈ పరిస్థితులు శ్రామికుల ఆరోగ్యం మీద ఎలాంటి ప్రభావం చూపిందో మార్క్స్ వివరించారు. ఆ దేశంలో అత్యంత అమానవీయ పరిస్థితులనే పునాది మీద పారిశ్రామిక పెట్టుబడి పెరిగింది.

అమెరికాలో అత్యంత శీఘ్రంగా జరిగిన పారిశ్రామికీకరణకూ, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికీ ఇలాంటి పరిస్థితులే కారణం. 'చాకిరీ కూపం' అనే పదం జనబాహుళ్యంలో బాగా ప్రాచుర్యం పొందింది ఈ దేశంలోనే. కనీసం రెండు కార్మిక చట్టాలను ఉల్లంఘించిన కర్మాగారాన్ని 'చాకిరీ కూపం'గా అమెరికా చట్టం అభివర్ణించింది. కఠోర శ్రమ, కార్మికులకు సంఘం పెట్టుకునే హక్కు లేకపోవడం, కనీస జీవనాధార వేతనాలు లేకపోవడంతో 'చాకిరీ కూపం' భావన ఆ తరువాత వ్యాప్తిలోకి వచ్చింది. 20వ శతాబ్దం ఆరంభం నుంచి అమెరికా పెట్టుబడి 'చాకిరీ కూపాల' మీద ఆధారపడింది. 1980ల కాలంలో న్యూయార్క్ నగరంలోని 'చాకిరీ కూపా'లు చైనా శ్రామికులతో నిండి ఉండేవి. అయితే, ఇంకా మరింత లాభాల కోసం కంపెనీలు తమ దేశంలో కంటే చాలా చౌకగా శ్రామికులు దొరికే దేశాలకు తమ కర్మాగారాలను తరలించారు.

**'చాకిరీ కూపం' సంస్కృతి – బానిసత్వ నూతన రూపాలు :** ఆ విధంగా ప్రపంచ వ్యాప్తంగా బహుళజాతి కంపెనీల బ్రాండ్‌ల కోసం ఉత్పత్తి చేసే 'చాకిరీ కూపాలు' 1990ల నుంచి విస్తృతంగా

వ్యాప్తి చెందాయి. నైక్, రిబోక్ కంపెనీలు ఆగ్నేయాసియా నుంచి ముఖ్యంగా దక్షిణ కొరియా నుంచి 'చాకిరీ కూపా'ల ఉత్పత్తులను ఉపయోగించాయి. ఆగ్నేయాసియా 'చాకిరీ కూపాల్లో' ఐదేళ్ళున్న పిల్లల్ని కూడా వారానికి 75 గంటల దాకా పని చేయిస్తున్నారని ఒక అమెరికా కాంగ్రెస్ కమిటీ పేర్కొంది. ఇదే కాలంలో మెక్సికో, హైతీ, హోండురాస్, నికరాగువా దేశాలలోని 'చాకిరీ కూపాలు' చౌక దుస్తులు, ఎలక్ట్రానిక్ పరికరాలను రిటైల్ చైన్స్ కోసం ఉత్పత్తి చేశాయి. వీటన్నింటిలో వాల్‌మార్ట్ అత్యంత ప్రముఖమైనది. దక్షిణాసియాలో 1990ల నుంచి 'చాకిరీ కూపా'ల ఉత్పత్తి పెరగడాన్ని ఈ సందర్భాన్ని బట్టి చూడవలసిన అవసరమున్నది. నూలు దారం, రెడీమేడ్ దుస్తుల ఔట్ సోర్సింగ్‌కి ప్రపంచ కేంద్రంగా భారతదేశంలోని తమిళనాడు ఆవిర్భవించింది. రాల్ఫ్, లారెన్, గాఫ్, డిస్కౌంట్ స్టోర్స్ వంటి కాంట్రాక్టింగ్ కంపెనీలు కాంట్రాక్టర్లకు వ్యాపార షరతులు పెడతాయి. వారికొచ్చే లాభాలు రెండు విషయాలపై ఆధారపడతాయి. ఒకటి, వారు ఉత్పత్తి చేసే డిజైన్లు. రెండు వర్ధమాన దేశాలలోని వస్తూత్పాదక పరిశ్రమలకు వారు ఇచ్చే ఉత్పత్తి ఖర్చులు. కాబట్టి ఉత్పత్తులను అమ్ముకోవడం పైనా, బ్రాండ్‌లను మార్కెట్‌లో స్థిరీకరించడం పైనా రిటైల్ కంపెనీలు తమ దృష్టిని కేంద్రీకరిస్తాయి. కాబట్టి కార్మిక చట్టాలను ఉల్లంఘించడం, చౌక శ్రమను ఆకర్షించడం ద్వారా సరఫరాదారులు, కాంట్రాక్టర్లు తమ లాభాలను పెంచుకోవాలని చూడడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

'చాకిరీ కూపా'ల యాజమాన్యాలు అవివాహిత బాలికలను, చిన్న పిల్లలను లక్ష్యంగా చేసుకుంటారు. కొత్త పథకాలతో యువతులను ఆకర్షించి వారిని ఒక రకమైన వెట్టి చాకిరీలోకి దించుతారు. ఉదాహరణకు, తమిళనాడులో 'సుమంగళి' పథకాన్ని ఫ్యాక్టరీ యాజమానులు ప్రారంభించారు. అవివాహిత బాలికలు మూడు సంవత్సరాలు పని ఒప్పందం చేసుకుంటే కట్నానికి పనికొచ్చే పెద్ద మొత్తం ఇస్తామని అభయమిచ్చారు. 'పెయిడ్ లేబర్ ఆర్గనైజేషన్' అనే సంస్థ 2012మేలో సర్వే చేసి కొన్ని వాస్తవాలను వెలికితీసింది. ఈ పథకం కింద పనిలో చేరిన మహిళలలో 60శాతం 16 సంవత్సరాల కంటే తక్కువ వయస్సు గలవారే. 84 శాతం శ్రామికుల వయస్సు 18 సంవత్సరాల కంటే తక్కువ. మూడు సంవత్సరాలు పనిచేసిన తరువాత వారికి లభించినది రూ. 20-25 వేలు. వారికి వచ్చిన కనీస జీవనాధారం వేతనం నెలకు రూ.400 మాత్రమే. ఈ పథకం కింద పనిలో చేరిన వారిలో ఐదవ వంతు మంది మాత్రమే నిర్ణీత మూడు సంవత్సరాల కాలాన్ని పూర్తి చేశారు. మూడవ వంతు మహిళలు నిర్ణీత మూడు సంవత్సరాల సమయం పూర్తికాక మునుపే పనిలో నుంచి వైదొలిగారు. అంటే వారికి ఈ పథకానికి సంబంధించిన ఎలాంటి ప్రతిఫలం దక్కలేదు.

సాదాసీదాగా చెప్పాలంటే కాంట్రాక్టర్లు పెట్టే తట్టుకోలేని నియమాల మూలాన ఈ బాలికలు పని నుంచి వైదొలగవలసి వచ్చింది. వారు స్వేచ్ఛగా తిరగడానికి అనుమతించేవారు కాదు. మరుగుదొడ్లు, ఆహారం లాంటి కనీస సౌకర్యాలు లేని వసతి గృహాలలో నివసించాలి. వారు జీతం లేకుండా ఓవర్ టైం పని చేయాల్సి వచ్చేది. దీని మూలాన వారి ఆరోగ్యం దెబ్బతినేది.

**కొనసాగుతున్న మార్క్స్ పిలుపు ఔచిత్యం :** తమిళనాడులోని 'చాకిరీ కూపా'లలోని పని స్థితిగతులు ప్రత్యేకమైనవేమీ కాదు. బంగ్లాదేశ్‌లో కూలిపోయిన రాణా బిల్డింగ్ కాంప్లెక్స్‌లో ఉన్న కర్మాగారాలలో పనిచేస్తున్న మహిళలు కూడా అలాంటి విషయాలే చెబుతారు. ఆరీఫా పది సంవత్సరాల వయస్సులో దుస్తుల కర్మాగారంలో చేరి 20 సంవత్సరాల పనిచేసింది. 100 టాకా (బంగ్లా కరెన్సీ)ల నెల జీతంతో ప్రారంభించి ప్రస్తుతం 2,200 టాకాల జీతం (కనీస వేతనం కంటే కొంచె ఎక్కువ) తీసుకుంటోంది. కానీ ఆ జీతం బ్రతకడానికి సరిపోదు. దీనికి ఆమె రోజుకు 13-14 గంటల పాటు గత 20 సంవత్సరాల నుంచి పనిచేస్తున్నది. ఆమెకు నెలకయ్యే ఖర్చు 5,000 టాకాలు. శ్రామికుల జీవితాలను ప్రభావితం చేసే మరో విషయమేమిటంటే ఈ ఫ్యాక్టరీలలో వృత్తిపరమైన కనీస భద్రతా నియమాలను పాటించరు. ఈ సందర్భంలో మనం గుర్తుచుకోవలసిన విషయం ఏమంటే రాణా బిల్డింగ్ 2013 ఏప్రిల్‌లో కూలిపోవడానికి ఎనిమిది సంవత్సరాలకు పూర్వం 2005లో ఒకసారి అగ్ని ప్రమాదానికి గురైంది.

తమిళనాడులోని తిరుపూరులోని కర్మాగారాలలో కూడా ప్రమాదాలు మామూలే. వాటిలో కనీస భద్రతా సౌకర్యాలు కాని, వైద్య సహాయం కాని లభ్యం కాదు. జీతం లేకుండా నిర్బంధంగా ఓవర్‌టైం చేయించటం లాంటి కార్మిక చట్టాల ఉల్లంఘన జరుగుతూనే ఉంటుంది. మహిళలను శారీరకంగా హింసించటం, లైంగికంగా వేధించటం నిత్యం జరుగుతూనే ఉంటుంది. కనీస వేతన చెల్లింపు జరగదు. 5-7 సంవత్సరాల వయస్సు పిల్లలను పనిలో పెట్టుకుంటారు. అంతర్జాతీయ కార్మిక సంస్థ అంచనాను బట్టి 2012లో 2.16 కోట్ల మంది నిర్బంధ శ్రామికులు (ఫోర్స్‌డ్ లేబర్)గా ఉన్నారు. వీరిలో మూడింట రెండు వంతుల మంది ప్రయివేటు కర్మాగారాలలో వెట్టిచాకిరీ చేస్తున్నారు.

ఈ కథ ప్రపంచ వ్యాప్తంగా ఉన్న 'చాకిరీ కూపా'ల్లో ఇదే మాదిరిగా ఉంటుంది. వీటిలో పనిచేసే శ్రామికుల జీవితాల్లో కనీస మెరుగుదలకు కార్మిక, మహిళా సంఘాలు ఎన్నో పోరాటాలుచేశాయి. చేస్తున్నాయి. ఆ విధంగా బంగ్లాదేశ్‌లోని దుస్తుల కర్మాగారాల్లో పనిచేసే శ్రామికులు కార్మిక సంఘం పెట్టుకునే హక్కు కోసం డిమాండ్ చేస్తున్నారు. రాణా బిల్డింగ్ దుర్ఘటన నేపథ్యంలో దుర్భర పరిస్థితులలో కార్మికులు పనిచేస్తున్న తీరును గమనంలోకి తీసుకోవలసిందిగా ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చారు. భారతదేశంలో కూడా ఈ రంగంలోని శ్రామికులను సంఘటితం చేసి పోరాటానికి సిద్ధం చేసే కార్యక్రమాన్ని ప్రజాస్వామిక కార్మిక సంఘాలు చేపట్టాయి. వర్తమాన కార్పొరేట్ పెట్టుబడిదారీ విధాన కుంభస్థలాన్ని కొట్టే శక్తి దానికున్నది కాబట్టి గౌరవ ప్రదమైన సాధారణ పనిదినం కోసం పోరాటం చేయాలనే మార్క్స్ పిలుపు గతం కంటే ఇప్పుడు మరింత సముచితంగా ఉన్నట్లు పోరాటాలు చూపాయి.

**- అనువాదం: నెల్లూరు నరసింహారావు**

# 'మెర్సీకిల్లింగ్' ను లోతుగా చర్చించిన 'మరణకాంక్ష' నవల

- వొరప్రసాద్




ప్రతీ మనిషి జీవితంలో ఆరోగ్యం కీలకపాత్ర పోషిస్తుంది. సమాజ కార్యకలాపాల్లో, ఉత్పత్తిలో ఆరోగ్యకరమైన ప్రజల భాగస్వామ్యం అనివార్యం. ఆరోగ్యంగా జీవించడానికి అవసరమైన వాతావరణం సమాజంలో ఏర్పాటుచేసుకోవాలి. మానవ సమాజ అభివృద్ధిలో ఆరోగ్యాన్ని సంరక్షించే వైద్యవ్యవస్థ కీలకపాత్ర పోషిస్తుంది. ఆధునిక వైద్యశాస్త్రం అద్భుతమైన అభివృద్ధిని సాధించింది. నూతన సాంకేతిక పరిజ్ఞానం వైద్యశాస్త్రాన్ని సుసంపన్నం చేసింది. ఎలాంటి వ్యాధికైన తగిన చికిత్సను అందించేంతగా వైద్యశాస్త్రం ఎదిగింది. అయితే విశాల ప్రజానీకానికి ఈ ఆధునిక వైద్యాన్ని చేరువచేయడంలో నేటి సమాజాలు వైఫల్యం చెందుతున్నాయి. అసమానతల వ్యవస్థలో ఆర్థికపుష్టి కలిగిన వారికే వైద్యం అందే పరిస్థితులు ఉన్నాయి. మరోపక్క వైద్యశాస్త్రాన్ని సవాలు చేసే వ్యాధులు సమాజాన్ని ఆందోళనకు గురిచేస్తున్నాయి. మనిషి ప్రాణంతో ఉండడం మినహా శారీరకంగా నిస్సహాయునిగా చేసే వ్యాధులు నైతిక చర్చలకు శ్రీకారం చుడుతున్నాయి. మస్కులర్ డీస్ట్రోఫీ వంటి వ్యాధులు ఈ చర్చలకు కారణమవుతున్నాయి. ఈ వ్యాధి వచ్చిన మనిషి శరీరంలోని అవయవాలు పెరుగుతున్న వయస్సుతో పాటు ఒక్కొక్కటి నిర్వీర్యం అయిపోతాయి. పనిచేయడం మానివేస్తాయి. మరణం మనిషి ఎదురుగా నృత్యం చేస్తూ కనపడ్తుంది. రోగి మానసిక వేదన వర్ణనాతీతంగా ఉంటుంది. చుట్టూ కుటుంబ సభ్యుల శుశ్రూష, వారు లేనిదే ఏ పనీచేసుకోలేని స్థితికి రోగి మరణవేదనకు గురవుతాడు. చనిపోతే బావుండని భావిస్తాడు. రోగి ఎదుర్కొనే ఈ పరిస్థితే నేడు ప్రపంచవ్యాప్తంగా చర్చనీయాంశమైంది. 'మెర్సీకిల్లింగ్' గురించిన వార్తలు వర్తమాన సమాజంలో అన్నిదేశాల్లో ప్రముఖంగా ప్రస్తావనకొస్తున్నది. అటువంటి అంశంపై కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత సలీం 'మరణకాంక్ష' నవలను రాశారు.

విభిన్నమైన వస్తువులతో ఇప్పటికే పలు నవలలు రాసిన సలీం ఇటీవల నవల 'మరణకాంక్ష'. ఈ నవలలో 'కారుణ్య హత్య'(మెర్సీ కిల్లింగ్) ల గురించి విభిన్న కోణాలలో రచయిత చర్చించారు. నిజానికి ఇటువంటి అంశంతో నవల రాయడం శ్రమతో కూడుకున్నది. వైద్యపరమైన అంశాలు, సామాజిక, నైతిక, న్యాయసంబంధ విషయాలు ఈ నవలలో ప్రధాన భాగంగా ఉంటాయి. వైద్యవిషయాన్ని నవలగా రాసి మెప్పించడానికి సలీం చేసిన కృషి ఫలించినట్టే. మానవతా దృక్పథంతో విరివిగా కవిత, కథ, నవలా ప్రక్రియలలో విరివిగా రాస్తున్న సలీం ఇతివృత్తాలను చాలా జాగ్రత్తగా ఎంచుకుంటారనిపిస్తుంది. తీసుకున్న వస్తువును బలంగా చెప్పడానికి రచయిత ప్రయత్నం కనపడుతుంటుంది. సాధ్యమైనంత సమాచారాన్ని పాఠకుడికి చేరవేయగలుగుతారు సలీం. అలా చేరవేస్తూనే పాఠకుడిలో మానవతా భావాలను ప్రేరేపించడానికి శతధా ప్రయత్నిస్తారు.

మరణకాంక్ష నవలలో కూడా ఆ ప్రయత్నం కనపడుతుంది. ఈ సమస్యపట్ల ఈ పుస్తకం చదివిన ప్రతీ పాఠకుడూ ఒక అవగాహనకు వస్తాడు. ఆ వ్యాధికి గురయినవారి పట్ల ఎలా ప్రవర్తించాలో తెలుసుకుంటాడు. అసలు మెర్సీకిల్లింగ్ అవసరమా? లేదా అంటే కొంత తేల్చుకోలేని పరిస్థితికి కూడా లోనవుతాడు.

ఈ నవలలో ఆ వ్యాధి సోకిన 'అక్షయ' న్యాయవాదిగా పేరుప్రఖ్యాతులు సాధిస్తుంది. అక్షయకు మెర్సీకిల్లింగ్ పట్ల తీవ్ర వ్యతిరేకత ఉంటుంది. తను ఈ వ్యాధికారణంగా శారీరకంగా బాధలు పడుతుంది. కాళ్ళు రెండూ చచ్చుపడిపోతాయి. కొన్ని అవయవాల మీద నియంత్రణ కోల్పోతుంది. ఎప్పుడు ఏ అవయవం సహాయ నిరాకరణ చేస్తుందో తెలియదు. అటువంటి తీవ్ర ఇబ్బందులన్నింటినీ అధిగమించి న్యాయవాద వృత్తి చేపడుతుంది. అక్షయ ఆత్మవిశ్వాసానికి ఆశ్చర్యపోయి కిరణ్ ఆమెను ప్రేమిస్తాడు. ఇద్దరూ దంపతులవుతారు. అక్షయ పాత్రను పాజిటివ్‌గా రచయిత చిత్రీకరించారు.

ఇదే రకమయిన వ్యాధితో బాధపడే ప్రసాద్ పాత్ర పూర్తి భిన్నంగా చిత్రించారు. ఇంటర్ పూర్తయ్యేటప్పటికి వ్యాధి తీవ్రమయి కాళ్ళు నియంత్రణ కోల్పోతాయి. రోజులు గడిచే కొద్దీ శరీరంలోని అవయవాలు క్షీణించిపోతూ ఉంటాయి. డిగ్రీ పూర్తికాకుండానే ఇంటికి పరిమితమయి వ్యాధితో తీవ్ర పోరాటం చేస్తుంటాడు. తను ప్రేమించిన క్లాస్‌మేట్ బెంగుళూరులో సాఫ్ట్‌వేర్ కంపెనీలో సెటిల్ అవుతుంది. అక్కడే తనకు నచ్చిన వ్యక్తిని ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. ఒకే కాలనీ కావడంతో ఆ అమ్మాయి విషయాలన్నీ తెలుస్తుంటాయి ప్రసాద్‌కి. తీవ్ర వేదనకు గురవుతాడు. శరీర బరువు తీవ్రంగా పెరిగిపోతుంది. వీల్ ఛైర్‌లోంచి మంచం మీదకు కూడా దించడం కష్టమవుతుంటుంది.

# విషాదాక్షరాలు

- డా. దిలావర్
9866923294



**నిన్నటి దాకా....**

నా అక్షరాలు
పొదరిండ్ల చుట్టూ వలయాలు చుట్టే
చిన్నారి పొన్నారి సీతాకోక చిలుకలు

నా అక్షరాలు
ఉత్సాహం వూపిరి పోసుకున్నట్టు
చెట్లతో సయ్యాట లాడే
బుజ్జి బుజ్జి ఉడత పిల్లలు

నా అక్షరాలు
ఊరించే దోర జామపండ్లను
జిలిబిలి కొట్టుడు కొట్టే
'రామ సక్కని' రామ చిలుకలు

నా అక్షరాలు
గున్నమావి లేలేత చిగుళ్ళను
స్వరపేటికలో మంత్రించి
ప్రకృతిక కలకూజితాల నీరాజనా లిచ్చే
ఎల కోయిలలు

నా అక్షరాలు
అంతులేని ఆకాశంలో
ఎల్లలెరుగ కుండా చక్కర్లు కొట్టే
రంగు రంగుల గాలి పటాలు

**నేడు....**

నా అక్షరాలు
ఇంకా ముక్కుపచ్చలారక ముందే,
రేపటి హరివిల్లులోకి
ఆనందపు రెక్కలు విప్పుకోక ముందే,
చిదిమి వేయబడి,
ఛిద్రమైన - నెత్తుటి ముద్దలు....

---

తండ్రి చిన్నప్పుడు యాక్సిడెంట్‌లో చనిపోతాడు. తల్లి బ్యాంకులో పనిచేస్తూ ప్రసాద్‌కు సపర్యలు చేస్తూంటుంది. ఆ కుటుంబం దయనీయ స్థితి పాఠకుడికి వేదన కలిగిస్తుంది.

ప్రసాద్ ల్యాప్‌ట్యాప్‌తోనే సమయమంతా గడుపుతాడు. తనలాగా ఇటువంటి వ్యాధితో బాధపడుతున్న వారి గురించి ఇంటర్నెట్‌లో గాలిస్తాడు. చాలామంది ఉంటారు. వారి వారి బాధలను, అభిప్రాయాలను అన్నిటినీ ఫేస్‌బుక్‌లో పెడతారు. అవన్నీ చదువుతాడు. తను కూడా తన భావాలను పంచుకోవడం ప్రారంభిస్తాడు. ప్రసాద్ అభిప్రాయాలను, భావాలను గమనిస్తూ చాలామంది ప్రసాద్‌కు పరిచయమవుతారు. వారిలో ఇదేరకమయిన వ్యాధితో బాధపడే రాగిణి అనే అమ్మాయి ప్రసాద్‌తో పరిచయం పెంచుకుంటుంది. ఇద్దరూ ల్యాప్‌ట్యాప్ సంభాషణల ద్వారా సన్నిహితులవుతారు. కొన్నాళ్ళు రాగిణి నుండి మెయిల్స్ ఆగిపోతాయి. ప్రసాద్‌కు అర్థం కాదు. ఒకవేళ ఆ వ్యాధి తీవ్రమయి తను చనిపోయిందా అని సందేహపడతాడు. మళ్ళా తిరిగి రాగిణి నుండి ఈమెయిల్ వస్తుంది. ల్యాప్‌ట్యాప్ పాడయితే హైదరాబాద్ పంపించి రిపేర్ చేయించేటప్పటికి ఆలస్యమయిందని రాస్తుంది. తిరిగి మళ్ళీ ఆన్‌లైన్ ఛాటింగ్ కొనసాగుతుంది. రాగిణిని చూడాలన్న కోరికి రోజురోజుకీ ప్రసాద్‌కు పెరిగిపోతుంటుంది. తన పరిస్థితి కూడా రోజు రోజుకూ దిగజారిపోతుంది. అమ్మతో ఆ సేవలు చేయించుకోవడం తట్టుకోలేకపోతున్నాడు. తన నిస్సహాయ పరిస్థితిని తలుచుకుని తలుచుకుని బాధపడుతుంటాడు. రాగిణిని కలవాలని తనకు వస్తున్నట్టుగా చెప్పకుండా తనుండే నకిరేకల్‌కు కారులో అమ్మతో సహా బయలుదేరతాడు. తీరా అతను వెళ్ళి రాగిణి ఉండే చోటు కనుక్కునే సరికి రాగిణి అక్కడ ఉండదు. తను చనిపోతుంది. తన చెల్లిని ఈమెయిల్స్ పంపించమని కోరిన విషయం ప్రసాద్‌కు చెప్తారు కుటుంబ సభ్యులు. తనలో ఆశను నింపడానికి రాగిణి పడిన తపన ప్రసాద్‌ను మరింత వేదనకు గురిచేస్తుంది.

ప్రసాద్ తన పరిస్థితిని వివరించి వాళ్ళ అమ్మతో మెర్సీకిల్లింగ్‌కు కోర్టులో విజ్ఞప్తి చేసేలా ఒప్పిస్తాడు. ఆ కేసులో అక్షయ మెర్సీకిల్లింగ్‌కు వ్యతిరేకంగా వాదించి గెలుస్తుంది. ప్రసాద్ పరిస్థితి మరింతగా దిగజారుతుంది. రోజురోజుకీ మరణానికి దగ్గరవుతుంటాడు. అతని తల్లి ప్రసాద్ పడుతున్న నరకయాతనను చూడలేకపోతుంది. ఇక చనిపోతాడు అనిపించి ఒక నిర్ణయానికి వచ్చి ప్రసాద్‌ను వదిలి బయటకు వెళ్తుంది. లాయర్ అక్షర ఇంటికి వెళ్ళి తన కొడుకు ప్రసాద్ చనిపోతున్న సమయంలో ఒక గంటసేపు అతని దగ్గర ఉండవలసిందిగా కోరుతుంది. అక్షర ముందు ఒప్పుకోదు. కిరణ్ ఒప్పించి తీసుకువస్తాడు. అక్షర, కిరణ్‌లు ప్రసాద్ చనిపోయేముందు పడుతున్న బాధను చూస్తారు. గంటసేపు అక్కడ భరించలేక వెళ్ళిపోదామని బయటకు వచ్చేస్తుంది. పరోక్షంగా ఆమెలో మెర్సీకిల్లింగ్ పట్ల సానుకూల ధోరణి వస్తుంది అన్నట్లుగా ఆ పాత్రను ముగించారు రచయిత.

అలాగే ఈ నవలలో ఇలా గుర్తుండిపోయే పాత్రలు మరికొన్ని ఉన్నాయి. అందులో డా. సిద్ధార్థ పాత్ర ముఖ్యమైంది. తనకి మెర్సీకిల్లింగ్ పట్ల పూర్తి సానుకూల ధోరణి ఉంటుంది. తను పనిచేసే హాస్పిటల్‌లో బతకలేక చనిపోలేక నరకయాతన పడుతున్న రోగులను చనిపోయేలాగ చేస్తుంటాడు. ఒకరోజు ఒక రోగి వెంటిలేటర్ తీసివేస్తూ నైట్ డ్యూటీలో ఉన్న తోటి డాక్టర్‌కు దొరికిపోతాడు. పోలీసులు అరెస్ట్ చేస్తారు. ఆ కేసులో డాక్టర్ సిద్ధార్థకు వ్యతిరేకంగా అక్షయ వాదిస్తుంది. మెర్సీకిల్లింగ్ చట్టబద్ధం చేయాలని డా. సిద్ధార్థ డిమాండ్ చేస్తాడు. రోగుల నరకయాతన చూడలేకే నేనాపని చేసానంటాడు. అక్షయ వాదనా పటిమతో కేసు గెలుస్తుంది.

మెర్సీకిల్లింగ్ గురించిన రెండువైపుల అభిప్రాయాలను సమానంగా ఈ నవలలో చర్చించారు సలీం. చివరికి తప్పనిసరి పరిస్థితులలో మెర్సీకిల్లింగ్‌కు అనుమతి ఇవ్వడం అవసరం అనే అభిప్రాయం తెలియజేస్తుంది 'మరణకాంక్ష' నవల.

మెర్సీకిల్లింగ్‌కు అనుమతించడం వల్ల కలిగే పరిణామాలను అలాగే అనుతించకపోతే కలిగే పరిస్థితులను ఆసక్తికర రీతిలో శక్తివంతంగా ఈ నవల చర్చించింది.

# కొత్త పుస్తకాలు

## ఉషస్సు




**కథలు, నాటికలు**

– కూర చిదంబరం

వెల : రూ.70/- పేజీలు : 156

**ప్రతులకు : 9848787284**

సాధారణంగా కనిపించే సంఘటనల్లో మనకు తెలియకుండానే అసాధారణాంశాలుంటాయి. వాటిని కథకులు మాత్రమే చూడగలరు. అక్షర రూపంలో పెట్టగలరు. కూర చిదంబరంగారు సరిగ్గా అదే పనిచేశారు. మనం చూస్తూ కూడా ఉపేక్షించే విషయాల్ని కథలో చదివినప్పుడు విస్తుపోతాం. విస్మయానికి లోనవుతాం. ఇలాంటి అంశాలే చిదంబరం గారి కథలో కనిపిస్తాయి.

– గుడిపాటి

## దేవరగట్టు




కథ

జి. వెంకటకృష్ణ

వెల : లేదు – పేజీలు : 24

**ప్రతులకు : 8985034894**

"ఖచ్చితంగా... ఖచ్చితంగా మానవజాతి హింస అనే సంకెళ్ళలో వుంది. దాని విముక్తికై చేసే పోరాటాలే యుద్ధాలూ వుద్యమాలూ, అరాచకాలూ అన్నీ... మనలాంటి దేశంలో అయితే ఆ విముక్తి పెద్ద పోరాటాల వైపు పోనీకుండా చేసి, చిన్న చిన్నగా ఆపేసేవే దేవరగట్టు లాంటివి"

– స్ఫూర్తి ప్రచురణకర్తలు

## జనారణ్యంలో జానకి




(నాటికల సంపుటి)

విడదల సాంబశివరావు

వెల : రూ.80/- పేజీలు : 53

**ప్రతులకు : 9866400059**

నాటక ప్రదర్శనను కొన్నివేలమంది మాత్రమే తిలకించగలరు. కానీ, ముద్రిత నాటక రాజమును కొన్ని లక్షలమంది చదువుతారు. సమాజం పాఠకుడి కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. అప్పుడు అతనిలో చైతన్యం వెల్లివిరుస్తుంది. ఈ వాస్తవాన్ని ప్రజలకు తెలియజేయడమే నా నాటక రచనల ప్రచురణ ప్రధాన లక్ష్యం. రంగస్థల నటుడుగా కొన్ని వేల ప్రదర్శనలిచ్చిన నేను రచయితగా ప్రజల అంతరంగంలోనికి తొంగి చూసే ప్రయత్నం చేస్తున్నాను.

– విడదల సాంబశివరావు

## 'కవేరా' రెక్కలు




కట్టా వెంకటేశ్వరరావు

వెల : రూ.50/- పేజీలు : 44

**ప్రతులకు :** 8096615202

ఇప్పుడు కట్టా వెంకటేశ్వరరావు (సంక్షిప్తనామం 'కవేరా') రెక్కలు ప్రచురిస్తున్నాడు. ఇంతకు ముందు కథలూ, వ్యాసాలూ, నవలలూ, కవితలూ రాసిన 'కవేరా' ఇప్పుడు రెక్కలు రాశారు. ఈ రెక్కలులో చాలా వరకు, సుగుమ్‌బాబు పంథాలోనే జీవన తాత్విక ఆలోచనలు ప్రధానంగా రాశారు.

– అద్దేపల్లి రామమోహన్‌రావు

## నీటి చుక్క



ఈతకోట సుబ్బారావు

వెల : రూ. 50/- పేజీలు : 46

**ప్రతులకు : 9440529785**

మొత్తంగా పతిత గుండెను అర్థం చేసే ఏకసూత్రత ఈ కవితలో చూస్తాం. కనుకనే ఈ దీర్ఘకవితను పాఠశాలల్లో, కళాశాలల్లో చదివి వినిపిస్తే మంచి స్పందన వుంటుంది. జీవన సంరంభంలో పడి కొట్టుకుపోయే మధ్యతరగతి పాఠక జనంచెంతకు దీనిని తీసుకెళితే కవి నిర్దేశించుకున్న లక్ష్యం నెరవేరుతుంది.

– గుడిపాటి

## నేస్తం! నన్ను మన్నించు....




కథలు

– డా॥ వాడపల్లి శ్రీరామమూర్తి

వెల : లేదు పేజీలు : 56

ప్రతులకు : 9440584343

ఇది వారి రెండవ కథా సంకలనం. సమాజంలోని కొన్ని కోణాలను చూపే దర్పణం. కథలకి ప్రాథమిక అవసరం – చదివించగలగడం. అది ఈ కథలలో కొంతవరకు వుంది. భాష బాగుంది సజీవంగా... సులభంగా అర్థమయ్యేలా! చిరుమాండలీకంతో. కాని కథలలోని పాయింటుని శక్తివంతంగా ప్రదర్శించగలిగితే చదివించే గుణం మరింత పెరుగుతుంది.

– ఇచ్ఛాపురపు రామచంద్రం

# కొత్త పుస్తకాలు

## పంచతంత్రం



సరళ వ్యావహారికంలో సమగ్ర కథనం

జగన్నాథశర్మ

వెల : రూ. 160/- పేజీలు : 196

ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్

తరతరాలుగా ప్రాచుర్యం పొందుతున్న ఈ కథలు నీతిదాయకాలు. ఉగ్గుబాలతో పాటే రంగరించి పిల్లలకు చెప్పాల్సిన అమూల్యమైన కథలు. పిల్లలు విచక్షణా జ్ఞానానికి పదును పెట్టే కథలు. జీవిత సత్యాలను గొప్పగా ఆవిష్కరించే కథలు. పిల్లల వ్యక్తిత్వ వికాసానికి దోహదపడే కథలివి. నాడు విష్ణుశర్మ మొదలుకొని నేడు జగన్నాథశర్మ దాకా ఎందరెందరో మహారచయితలు ఈ పంచతంత్ర కథలను తమదైన శైలితో తీర్చిదిద్ది అటు పిల్లలను, ఇటు పెద్దలకు రసవత్తరంగా అందించారు.

వల్లూరు శివప్రసాద్

## సుద్దాల అశోక్ తేజ నేలమ్మా నేలమ్మా గేయరూప కవిత్వం పరిశీలన



గోపగాని రవీందర్

రూ. 90/- పేజీలు : 149

ప్రతులకు : 27678430

ఈ పరిశోధన గ్రంథంలో మూడు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలో గేయ ప్రాదుర్భావ నేపథ్యాన్ని, గేయం రకాలనీ, ప్రాముఖ్యతని వివరిస్తూ, గేయకవుల వర్గీకరణ చేశాడు. ప్రముఖ తెలంగాణ గేయ కవులను సంక్షిప్తంగా పరిచయం చేస్తూ వీరిలో సుద్దాల అశోక్‌తేజ ప్రత్యేకతను వివరించాడు. పాటను ప్రజావాణిగా పలికించి పీడితజన పక్షపాత గీతానికి జానపద బాణీనద్ది పండిత, పామరుల అభిమానాన్ని అశోక్‌తేజ చూరగొన్నాడని నిర్ధారించాడు.

- బన్న అయిలయ్య

## నాలుగు శతాబ్దాల నగరం




వేదగిరి రాంబాబు

వెల : రూ.100/- పేజీలు : 196

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపులు

హైదరాబాద్ చరిత్ర మీద ఎన్నో పుస్తకాలు వచ్చాయి. వస్తున్నాయి. ముస్లిం చారిత్రకులు ఈ చరిత్రను ఒక విధంగా చెప్తే, హిందూ హిస్టోరియన్స్ ఈ చరిత్రను మరోవిధంగా చెప్పారు. కానీ చరిత్ర అన్నది ఎప్పుడూ ఒకటిగా ఉంటుంది మారదు. మనం ఎంతో చరిత్ర వున్న వాళ్ళం. ఈ చారిత్రావగాహన మన ఆలోచనలకు పదును పెడుతుంది. కుతుబ్ షాహీ చరిత్ర మీద ఒక సమగ్ర అవగాహనను అసఫ్‌జాహీల చరిత్ర మీద రేఖా మాత్ర అవగాహనను కలిగించడానికి ఈ గ్రంథం తోడ్పడుతుంది.

- డా॥ వేదగిరి రాంబాబు

## వేదగిరి రాంబాబు



కథానికలు

వెల : రూ.60/- పేజీలు : 134

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపులు

ఏర్చికూర్చిన కథానికల పూలగుత్తే మనచేతిలో ఉన్న ఈ పుస్తకం. దీనిలోని ఒక్కొక్క కథానికా పుష్పం సహజ సుందర శిల్పవికాస రూపం. ఒక్కొక్క కథానికా వస్తువు సమకాలిక సామాజిక / వైయక్తిక సంక్లిష్టతా వలయంలో నుంచి లాగి మానవ జీవన శకలంగా రూపు గట్టించినది. ఈ విధంగా వస్తు శిల్పకళాకృతులను దాల్చిన ఈ కథానికలు ఈనాటి సమాజానికి అత్యంతావశ్యక మయినవి.

- పోరంకి దక్షిణామూర్తి

## తెలుగు కథానికకు వందేళ్ళు



డా॥ వేదగిరి రాంబాబు

వెల : రూ. 100/- పేజీలు : 174

ప్రతులకు : 9391343916

ఆయా జిల్లాలలోని రచయిత(త్రు)లు, విమర్శకులు, సాహిత్యాభిమానులందరూ ఈ సదస్సులలో పాల్గొన్నారు. కథానికల గురించి విరివిగా చర్చలు సాగాయి. అంతటితో ఊరుకోకుండా ప్రతిజిల్లాలోనూ – ఆ జిల్లాల్లో వందేళ్ళ కథానిక మీద పోటీలు పెట్టాను. అలా పోటీలు పెట్టడం వల్ల చాలామంది ఆ జిల్లాల కథానికా పరిణామాన్ని ఆలోచిస్తారని బహుమతిగా ఇవ్వడమే కాకుండా, వాటన్నింటినీ కలిపి ఇప్పుడు సంకలనంగా తెస్తున్నాం.

- ప్రచురణ కర్త

## డా॥ వేదగిరి రాంబాబు పరిశోధనలు



వేదగిరి రాంబాబు

వెల : రూ.200/- పేజీలు : 560

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపులు

ఈ నాలుగు పరిశోధనలకీ నేను నా జీవితంలో నాలుగు సంవత్సరాలని వెచ్చించటం జరిగింది. వీళ్ల జీవితాల్ని ముందు నేను సామాజిక కోణం నుంచి చూసి, తరువాత సీరియల్స్‌గా రచించి, ప్రచురించి, అప్పుడు గ్రంథస్థం చేయటం జరిగింది. అందుకే ఈ గ్రంథానికి తెలుగు సాహిత్యంలో ప్రత్యేక స్థానముందని భావిస్తున్నాను. ప్రత్యేక సామాజిక బాధ్యతతో నేను ఈ పరిశోధనలు చేశాను.

డా - వేదగిరి రాంబాబు


సభలో ప్రసంగిస్తున్న మోతుకూరి నరహరి

ప్రపంచీకరణకు వ్యతిరేకంగా

## కవులు కలాలు కదిలించాలి : మోతుకూరి

జూన్ 15న ప్రపంచీకరణకు వ్యతిరేకంగా కవులు కలాలు కదిలించేందుకు మహా కవి శ్రీశ్రీని ఆదర్శంగా తీసుకోవాలని ప్రముఖ సాహితీవేత్త, ఆంధ్ర సారస్వత ప్రాచ్య కళాశాల మాజీ ప్రిన్సిపాల్ మోతుకూరి నరహరి అన్నారు. సాహితీ స్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో శ్రీశ్రీ 30వ వర్ధంతి సభ జరిగింది. ఈ సందర్భంగా ముఖ్య అతిథిగా పాల్గొన్న మోతుకూరి నరహరి మాట్లాడుతూ మహాకవి శ్రీశ్రీ అట్టడుగు వర్గాల గురించి తన కవిత్వంలో వివరించారన్నారు. ఆ మహాకవి పోయిన తర్వాత 30 ఏళ్ల నాటికి మనం పురోగమిస్తున్నామా లేక తిరోగమిస్తున్నామా అనే అంశాన్ని నేడు ఆత్మ పరిశీలన చేసుకోవాల్సిన అవసరం ఉందన్నారు. ఇప్పుడున్న సమాజం ఎటు పోతుందో ఆలోచించాలని, నేటి కవులు భావకవిత్వం, ప్రేమ కవిత్వం లాంటివి రాస్తున్నారని వారు శ్రామికులపక్షం వహించే కవిత్వం రాసేందుకు ప్రయత్నించాలని సూచించారు. అధ్యక్షత వహించిన కవి తంగిరాల చక్రవర్తి మాట్లాడుతూ శ్రామికవర్గాల అభ్యున్నతి కోసం శ్రీశ్రీ సాహిత్యాన్ని రాశారని శ్రామికవర్గాన్నే తన కథానాయకులుగా చేసుకుని ఆయన రచనా వ్యాసంగం కొనసాగించారన్నారు. శ్రీశ్రీ వచన కవిత్వంతో పాటు పద్యకవిత్వం కూడా కృష్ణశాస్త్రికి ధీటుగా రాశారన్నారు. అనంతరం సాహితీస్రవంతి నగరకమిటీ సభ్యురాలు శాంతిశ్రీ అధ్వర్యంలో నిర్వహించిన జనకవనంలో కొండపల్లి నీహారిణి, తంగిరాల చక్రవర్తి, శిష్టామాధవి, నరేశ్, రత్నామహీధర్; వీరప్రసాద్, రఘుశ్రీ, ఎం. రాధాకృష్ణ, అల్వాల్ సురేశ్ ఒబ్బిని, ఎ. మోహన్‌కృష్ణ, గేరా, కె.ఎల్. కామేశ్వరరావు, పొత్తూరి సుబ్బారావు, జి. నరసింహమూర్తి, మౌనశ్రీమల్లిక్, కందేపి రాజ్యలక్ష్మి, రజనీగంగాధర్ తదితరులు శ్రీశ్రీపై కవితలు చదివారు. నగర కమిటీ సభ్యుడు టి. వెంకటి, జి. యాదగిరిరావు కె. లక్ష్మయ్య, కొంపల్లి కామేశ్వరరావు, ఆచార్య నరేంద్రతదితరులు పాల్గొన్నారు.



**కవయిత్రి ఎన్. అరుణ కవిత్వంపైన వివిధ రచయితలు రాసిన వ్యాస సంకలనం 'అరుణ కవిత్వం - అవలోకనం' గ్రంథాన్ని హైదరాబాద్ శ్రీత్యాగరాయ గానసభలో డా॥ సి. నారాయణరెడ్డి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ వై. రామకృష్ణారావు, డా॥ నీరజ జవ్వాజి, డా॥ సి. భవానీ దేవి భూమిక సంపాదకురాలు కొండవీటి సత్యవతి, సభాధ్యక్షులు ఓల్గా, ఎన్. అరుణ, దుగ్గిరాల సోమేశ్వర రావు, ఆచార్య ఎస్వీ సత్యనారాయణ కిన్నెర అధినేత మద్దాలి రఘురాం, డా॥ ఓలేటి పార్వతీశం ఉన్నారు.**

## తొలి అభ్యుదయ కవి శ్రీశ్రీ


మాట్లాడుతున్న రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి

తొలి అభ్యుదయ కవి శ్రీశ్రీ అని ప్రముఖ రచయిత, విమర్శకులు రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి అన్నారు. ఆయన సాహిత్యం నేటికీ అవసరమన్నారు. జూన్ 15న కడప జనవిజ్ఞాన వేదిక కార్యాలయంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి సమావేశం కడపజిల్లా సాహితీ స్రవంతి కన్వీనర్ ఎస్.మస్తాన్‌పల్లి అధ్యక్షతన నిర్వహించారు. తొలుత శ్రీశ్రీ చిత్ర పటానికి పూల మాలవేసి నివాళి అర్పించారు. అనంతరం రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి మాట్లాడుతూ శ్రీశ్రీ సాహిత్యం పౌరాణికంతో మొదలై విప్లవ సాహిత్యంతో ముగిసిందన్నారు. తన సాహిత్యానికి సమాజానికి ఎంత సంబంధం ఉంది? అని ప్రశ్నించుకొన్న శ్రీశ్రీ 1933 జయభేరి కవితలో 'నేను సైతం' రాసి సమాజాభివృద్ధి ప్రతిఒక్కరు కలసి రావాలన్న ఆలోచనను రేకెత్తించారన్నారు. భావ కవితల్ని పక్కనబెట్టి మనిషి, సమాజం ఎదుర్కొంటున్న సమస్యలపై తన సాహిత్యానికి పదును పెట్టారన్నారు. ఆకాశంలో పయనిస్తున్న సాహిత్యాన్ని భూమార్గం పట్టించిన వ్యక్తి శ్రీశ్రీ అని కొనియాడారు. మతం, ప్రాంతీయం కాదు వర్గ దృష్టి తన దృష్టి మలచిన మహామనిషి అని అన్నారు. మహాప్రస్థానం, ఖడ్గసృష్టి, మరో ప్రస్థానం ద్వారా జనచైతన్యం తెచ్చారన్నారు. తన శ్రామిక జన సాహిత్యంపై ప్రస్తావిస్తూ 'వాడు' కవిత్వాన్ని చదివి వినిపించారు. శ్రీశ్రీ కవిత్వం వర్గదృష్టి శ్రమ దోపిడీకి వ్యతిరేకంగా కష్టజీవికి అండగా ఉందన్నారు. సాహిత్యనేత్రం ఎడిటర్ శశిశ్రీ మాట్లాడుతూ సాహిత్య కారులకు వర్గదృష్టి ఉండాలన్నారు. కార్యక్రమంలో జెవివి జిల్లా ప్రధాన కార్యదర్శి ఎ. రఘునాథరెడ్డి, మొగిలిచెండు సురేష్, పాలగిరి విశ్వప్రసాద్, అవధానం శ్రీనివాస్, సావంత్‌సుధాకర్, సోఫియా, అనిత, సబ్బరాయుడు, పవన్, గోవిందు, ఇరగయ్య సుదర్శన్ పాల్గొన్నారు.

## ఖమ్మం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి



ఖమ్మంలో శ్రీశ్రీ విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పిస్తున్న సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి, ఖమ్మం జిల్లా ప్రధాన కార్యదర్శి రౌతురవి, కన్నెగంటి వెంకటయ్య తదితరులు

జూన్ 15న సాహితీస్రవంతి ఖమ్మం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి సభ జరిగింది. డా. సిహెచ్. ఆంజనేయులు, సాహితీస్రవంతి ఖమ్మం జిల్లా ప్రధాన కార్యదర్శి రౌతురవి, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి, బోడేపూడి విజ్ఞానకేంద్రం నిర్వహించే ఆదివారం మీకోసం కార్యక్రమ నిర్వాహకులు జోసఫ్‌లు ఈ సందర్భంగా ప్రసంగించారు. ముందుగా ఖమ్మం నగర రింగ్ రోడ్ వద్దగల శ్రీశ్రీ విగ్రహానికి పూలమాల వేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమంలో కన్నెగంటి వెంకటయ్య, వురిమళ్ళ సునంద, కపిల రాంకుమార్ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా జరిగిన జనకవనంలో తాళ్ళూరి లక్ష్మి, రాధ, బండారు రమేష్, తోట కృష్ణారావు, మహతి సునంద, దాసోజు శ్రీనివాస్, క్రాంతికార్, కపిల రాంకుమార్‌లు కవితలు చదివారు. ఎం. శేషగిరి శ్రీశ్రీ రాసిన గేయాన్ని ఆలపించారు. ఈ కార్యక్రమంలో ముఖ్యఅతిథిగా పాల్గొన్న డా. కావూరి పాపయ్య శాస్త్రి మాట్లాడుతూ శ్రీశ్రీ స్పష్టమైన సాహితీ అవగాహన కలిగివుండి, సంస్కృత, ఆంగ్ల భాషల్లో గట్టి పట్టు సాధించారన్నారు. ఎన్నో అనువాదాలకు, అనుసృజనకు, కొత్తకొత్త ప్రయోగాలకు ఆద్యుడయ్యాడని అన్నారు. ఈ శతాబ్దం నాది అని ఆత్మవిశ్వాసంతో చెప్పకలిగినవాడు శ్రీశ్రీ అన్నారు. అప్పటిదాకా వున్న భావకవితా ధోరణికి భిన్నంగా అభ్యుదయ భావాలను రంగరించి, మొదట సంప్రదాయ సాహిత్యంలో వృత్తాలలో, కందాలతో ప్రారంభించి, క్రమేణా మాత్రాఛందస్సు పట్టుకుని గురజాడ వారసత్వాన్ని కొనసాగించారని తెలిపారు. వ్యాసం, సమీక్షలు, రేడియో నాటికలు, ఇతర భాషా చలన చిత్రాలకు తెలుగు అనువాదం చేయడం, పత్రికా రంగం ఇలా ఎన్నో ప్రక్రియలలో శ్రీశ్రీ ప్రతిభను ప్రదర్శించాడని అన్నారు. సాహితీ విస్తృతి పొందటానికి శ్రీశ్రీ కృషి అనిర్వచనీయమని, అమూల్యమని కె. ఆనందాచారి తన ప్రసంగంలో పేర్కొన్నారు. కె. హిమబిందు, జోసఫ్, చావా వీరభద్రయ్య, స్వామి, జి. నాగేశ్వరరావు, ప్రజాసంఘాల నాయకులు మచ్చా వెంకటేశ్వర్లు, ఎ.జె. రమేష్, నున్నా నాగేశ్వరరావు, వాసిరెడ్డి వీరభద్రం, బి.వి.కె. మేనేజింగ్ కమిటీ బాధ్యులు, ప్రసాద్, గోపాలరావు, బి.వి.కె. విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



మే 28న సాహితీ కిరణం తుర్థ వార్షికోత్సవ సందర్భంగా హైదరాబాద్ త్యాగరాయ కళావేదికలో పట్టాభికళా పీఠం వారు నిర్వహించిన కవితల పోటీల్లో విజేతగా గుర్రాల రమణయ్య, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత రావూరు భరద్వాజ చేతులమీదుగా బహుమతి నందుకుంటున్న దృశ్యం వేదికపై గుదిబండి వెంకటరెడ్డి, డా॥ పోతుకూచి సాంబశివరావు, తూములూరి రాజేంద్రప్రసాద్ తదితరులు.



మే 26న మానస ఆర్ట్స్ అకాడమీ (విజయవాడ) సంస్థ నుండి ఉగాది 2013 సాహిత్య పురస్కార గ్రహీతల్లో తంగిరాల చక్రవర్తి, రఘుశ్రీ, సి. హెచ్.వి. బ్రహ్మానందరావు, ప్రసాద్, రమణమూర్తి తదితరులు.



జూన్ 6వ తేది శ్రీ త్యాగరాయగానసభ హైదరాబాద్‌లో జీ.వి.ఆర్ ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన 11వ వార్షికోత్సవ వేడుకల ముగింపు కార్యక్రమంలో ముఖ్య అతిథి సమాచార శాఖ కమీషనర్ పి. విజయబాబు ద్వారా జీవిత సాఫల్య పురస్కారం స్వీకరిస్తున్న డా॥ ద్వానా శాస్త్రి (సాహిత్యం) గుదిబండ వెంకటరెడ్డి, సి. రామకృష్ణ డా॥ మంగళగిరి ప్రమీలాదేవి, పి. జయప్రకాష్ రెడ్డి తదితరులు




మే 12వ తేది కవితా వికాస వేదిక, లెర్ఫ్, మానస ఆర్ట్ సంస్థల ఆధ్వర్యంలో హైదరాబాద్ ప్రెస్ క్లబ్‌లో డా॥ ఎం.బి.డి శ్యామల రచించిన "సజీవక్షణాలకోసం" గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ప్రసిద్ధ కవి కె. శివారెడ్డి చిత్రంలో రఘుశ్రీ, మాణికాలరావు, ఆచార్య ఎన్.గోపి, డా॥ శ్యామల, బిక్కి కృష్ణ, బైసదేవదాసు వున్నారు.



మే 28న హైదరాబాద్‌లో త్యాగరాయ గానసభలో సాహితీ కిరణం మాసపత్రిక చతుర్థ వార్షికోత్సవం సందర్భంగా డా॥ పట్టాభి కళాపీఠం సౌజన్యంతో రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన కవితల పోటీలో గెలుపొందిన ద్వితీయ బహుమతిని జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా॥ రావూరి భరద్వాజ ద్వారా అందుకుంటున్న రచయిత ఎస్. ఎం. సుభాని. చిత్రంలో గుదిబండి వెంకటరెడ్డి, డా॥ పోతుకూచి సాంబశివరావు, పట్టాభి కళాపీఠం అధ్యక్షులు తూములూరి రాజేంద్రప్రసాద్, కార్తీక్ డెవలపర్స్ ఎం.డి. వి.వి. రాఘవరెడ్డి పొత్తూరి సుబ్బారావు ఉన్నారు.



హైదరాబాద్‌లో త్యాగరాయగాన సభలో జూన్ 1వ తేది 2013 కళాసుబ్బారావు కళావేదికలో గిరిరాజు విజయలక్ష్మి సేవాపురస్కారం ప్రదానం. ఎడమ నుండి డా॥ కళా వెంకటదీక్షితులు ప్రవీణ్‌కుమార్, చిత్రకారుడు శక్తిదాస్, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ కమలా ప్రసాదరావు, గిరిరాజు విజయలక్ష్మి, బింగి నరేంద్రగౌడ్ తదితరులు.



మే 26న విజయవాడలో, చంద్రరాజేశ్వరరావు స్మారక గ్రంథాలయంలో, మానస సాహిత్య సాంస్కృతిక అకాడమి ఆధ్వర్యాన కవి రమణ వెలమకన్నిని ప్రతిభా సాహిత్య పురస్కారంతో సత్కరిస్తున్న ప్రముఖ రంగస్థలనటులు, కవి కర్నాటిలక్ష్మి నరసయ్య, మాజీ శాసన సభ్యులు షేక్ నాజర్‌వలి. చిత్రంలో శ్రీయుతులు. లింగాల రామతీర్థ, అకాడమి అధ్యక్షులు బ్రహ్మానందరావు మరియు కవి రఘుశ్రీ ఉన్నారు.



మే 28న హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభ కళా వేంకట సుబ్బారావు కళావేదికలో జరిగిన సాహితీ కిరణం చతుర్థ వార్షికోత్సవం సందర్భంగా డా॥ పింగళి జగన్నాథరావు స్మారక పురస్కారం 2013ని డా॥ పోతుకూచి సాంబశివరావుకు అందిస్తున్న డా॥ రావూరి భరద్వాజ.చిత్రంలో ఆదివిష్ణు, గుదిబండి వెంకటరెడ్డి, పొత్తూరి సుబ్బారావు, తూమూలూరి రాజేంద్రప్రసాద్ ఉన్నారు.



మే 19న స్పందన అనంతకవుల వేదిక ఆధ్వర్యంలో ప్రెస్‌క్లబ్ అనంతపురంలో జరిగిన సభ చం-స్పందన జీవిత సాఫల్య పురస్కారం అందుకుంటున్న అవిశ్రాంత కవి డా॥ రాధేయ, ప్రదానం చేస్తున్న కవి 'చం'



గుంటూరు శేషేంద్రశర్మ 6వ వర్థంతిని పురస్కరించుకుని మే 30నహైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో జరిగిన కార్యక్రమంలో జ్ఞానపీఠ అవార్డు గ్రహిత రావూరి భరద్వాజ, తిరునగరి చినవీరభద్రుడు కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి, ముదిగొండ శివప్రసాద్, యార్లగడ్డ శైలజ, సాత్యకి పాల్గొన్నారు. ఈ సందర్భంగా గుంటూరు శేషేంద్ర శర్మ రచన 'షోడశి రామాయణ రహస్యాలు' పుస్తకాన్ని ఆవిష్కరించారు.




మే 19న ఉస్మానియా మెకస్టార్ ఆడిటోరియం హైదరాబాద్‌లో తెలంగాణ రచయితల వేదిక వారి ఆధ్వర్యంలో జరిగిన తెలంగాణ మలిదశ ఉద్యమ మలుపులో ఇపుడేం చేద్దాం? అనే అంశంపై కవి చీపెల్లి బాపు రచించిన వజ్ర సంకల్పం (తెలంగాణ దీర్ఘ కవిత)ను ప్రజా గాయకుడు గద్దర్ ఆవిష్కరించారు. ఈ కార్యక్రమములో తెలంగాణ రచయితల వేదిక రాష్ట్ర అధ్యక్షులు జూలూరి గౌరి శంకర్ నడుస్తున్న తెలంగాణ పత్రిక సంపాదకులు డా॥ సి. కాశీం, డా. నాళేశ్వరం శంకరు, తెలంగాణ రచయితల వేదిక ఆదిలాబాద్ (తూర్పు, పశ్చిమ) జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు తోటపెల్లి భూమన్న, తోకల రాజేశం, డా. ఉదారి నారాయణ, గోపగాని రవీందర్, ముత్యబోయిన మలయశ్రీ, పత్తి శివప్రసాద్, డా. దామెర రాములు, అంబటి నారాయణ, మాసపత్రి ఆశాకిరణ్, ఉషాకిరణ్, వెంకట్, జలంపెల్లి యాదగిరి, కుమ్మరి సురేష్, రేగుంట పోషన్న తదితరులు పాల్గొన్నారు.

## విమలాశాంతి సాహిత్య పురస్కారం

2013 సంవత్సరము "శాంతి రజనీకాంత్ స్మారక కథా పురస్కారం" పేరుతో ఇచ్చే విమలాశాంతి సాహిత్య పురస్కారాన్ని కథకులకు ప్రదానం చేయడానికి జాతీయస్థాయిలో ఉత్తమ కథా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు శాంతినారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. ఒక సంవత్సరం కవిత్వానికి ఒక సంవత్సరం కథకు ఇచ్చే ఈ పురస్కారాన్ని ఈ సంవత్సరం కథకు ఇస్తున్నారు. ఈ పురస్కారం క్రింద రూ. 10,000/-ల నగదును, జ్ఞాపికను అందజేస్తారు.

**నిబంధనలు :** జనవరి 2011 నుండి డిసెంబరు 2012 మధ్యకాలంలో ప్రచురించిన కథా సంపుటాలు మాత్రమే పరిశీలనకు స్వీకరింపబడతాయి. రచయితలు తమ తమ కథా సంపుటాలను 15.7.2013వ తేదీ లోగా డా॥ అంకే శ్రీనివాస్, తెలుగు లెక్చరర్, కేరాఫ్ డి. జయనారాయణ, జనరల్ స్టోర్స్, డోర్ నెం. 1/325, నీలిమా థియేటర్ ఎదురుగా 1వ రోడ్డు, అనంతపురం అనే చిరునామాకు పంపాలి. పరిశీలన కోసం పంపే కథా సంపుటాలను నాలుగు కాపీల వంతున పంపాలి. మూడు కాపీల మీద "విమలాశాంతి సాహిత్య పురస్కారం కోసం" అని తప్పనిసరిగా రాసి పంపాలి. ఎంపికయిన కథా సంపుటి రచయితకు 2013 సెప్టెంబరులో జరిగే పురస్కారోత్సవ సభలో అవార్డును ప్రదానం చేస్తామని తెలిపారు.

## కవితలకు ఆహ్వానం

### డా॥ రాధేయ కవితా పురస్కారం - 2013

డా॥ రాధేయ గౌరవార్థం వారి శిష్యులు దోర్నాదుల సిద్దార్థ, సుంకర గోపాల్, పెళ్ళూరు సునీల్, "డా॥ రాధేయ కవితా పురస్కారం" పేరిట రాష్ట్ర స్థాయి అవార్డులు నెలకొల్పడం జరిగింది. నాల్గవ సంవత్సర పురస్కారం కోసం రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న కవుల నుంచి కవితలను ఆహ్వానిస్తున్నారు. **నిబంధనలు :** కవి పేరు, చిరునామా కవితపై ఉండకూడదు, హామీ పత్రం మీదనే వ్రాయాలి. న్యాయ నిర్ణేతలు ఎంపిక చేసిన ఉత్తమ కవితకు రూ. 2116/- నగదు, జ్ఞాపికతో సత్కారం ఉంటుంది. కవితలు సామాజిక స్పృహ కలిగి ఉండాలి. వస్తువు విషయంలో కవికి పూర్తి స్వేచ్ఛ కలదు. సుదీర్ఘ కవితలు పరిశీలించబడవు. కవితలు చేరాల్సిన చివరి తేదీ 31.7.2013. కవితలు చేరవలసిన చిరునామా : దోర్నాదుల సిద్దార్థ, వి.టి.ఎస్. క్వార్టర్స్, యం.సి.పాళ్యం, పలమనేరు - 517408, చిత్తూరు జిల్లా, సెల్ : 9492374787, 904476885



జూన్ 14న విశాఖపట్నం పౌరగ్రంథాలయంలో ప్రముఖ రచయిత డాక్టర్ చింతకింది శ్రీనివాసరావు కథా సంపుటి 'దాలప్పతీర్థం' ఆవిష్కరణ సభాదృశ్యం. చిత్రంలో గ్రంథావిష్కర్త ప్రముఖ కవి శివారెడ్డి. వ్యాపారవేత్త చెరువు రామకోటయ్య. కవి ఎల్.ఆర్.స్వామి. వైజాగ్ జర్నలిస్టు్స ఫోరం అధ్యక్షుడు గంట్ల శీనుబాబు కవిశ్రీ మధునాపంతుల సత్యనారాయణమూర్తి. రచయిత చింతకింది శ్రీనివాసరావు. ప్రసిద్ధ కవి ఎండ్లూరి సుధాకర్. కవి ఎస్. రఘు ఉన్నారు.

## కష్టజీవుల స్నేహితుడు శ్రీశ్రీ

విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూన్15న విజయనగరంలోని గురజాడ స్వగృహంలో శ్రీశ్రీ వర్థంతి సభ జరిగింది. సాహితీస్రవంతి విజయనగరం కో-కన్వీనర్ యస్.వి.కృష్ణారావు సభకు అధ్యక్షత వహించారు. ఆయన మాట్లాడుతూ తెలుగు సాహిత్యానికి నూతన ద్వారాలు తెరిచిన వాడు శ్రీశ్రీ అన్నారు. కవి అంటే కష్టజీవుల స్నేహితుడు అని శ్రీశ్రీ రాసిన 'కమ్మరికొలిమి' కవితా చరణాలను ఉదహరించారు. శ్రీశ్రీ శ్రమైకజీవుల పక్షపాతి అన్నారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ పాత్రికేయులు ఎ.వి. సుబ్బారావు మాట్లాడుతూ సాహితీస్రవంతి వర్థంతి సభలను నిర్వహిస్తూ, కవులను, గాయకులను వారిలోని సృజనాత్మక శక్తిని పదునుపెట్టుకొనేలా ప్రోత్సహిస్తుందని కొనియాడారు. మరో అతిథి పి.వి.జి. నాటక కళాపరిషత్ అధ్యక్షులు, న్యాయవాది యన్. రాజా మాట్లాడుతూ శ్రీశ్రీ ముందుచూపుతో చేసిన రచనలు నేటికీ మార్గదర్శకంగా నిలిచాయని అన్నారు. ఆ రోజుల్లో ప్రతీఒక్కరి చేతుల్లో శ్రీశ్రీ 'మహాప్రస్థానం' కనపడేదన్నారు. సాహితీస్రవంతి విజయనగరం జిల్లా కన్వీనరు చీకటి దివాకర్ మాట్లాడుతూ శ్రీశ్రీ మార్క్సిస్టు అవగాహనతో సాహిత్యం రాయడం వల్ల ప్రజల సమస్యలు, బాధలు తన బాధలుగా స్వీకరించాడని అన్నారు. కవి రెడ్డి రామకృష్ణ మాట్లాడుతూ ఏ కవి అయితే సమాజం గూర్చి ఆలోచిస్తూ, వారి బాధలను పట్టించుకుని కవిత్వం రాస్తారో అటువంటి కవులు ప్రజల హృదయాలలో ఎన్నటికీ నిలిచే ఉంటారని అన్నారు. 'జోహార్ జోహార్' అనే గేయాన్ని పాడి వినిపించారు. శ్రీశ్రీ 'మరోప్రపంచం మరోప్రపంచం' గేయాన్ని ఆలపించిన కె. లక్ష్మిని అందరూ అభినందించారు. శ్రీమతి ఆదిలక్ష్మి, శ్రీనివాసరావు, లక్ష్మణరావు తదితరులు తమ కవితలను, గేయాలను ఆలపించారు.




......................

జూన్ 1న కాకినాడ, సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో అడపా రామకృష్ణ రాసిన 'అడపా రామకృష్ణ కథలు' కథా సంపుటి పరిచయ సభ జరిగింది. వి.ఎస్.ఆర్ సోమయాజులు, కథల్ని విశ్లేషిస్తూ ప్రసంగించారు. రామకృష్ణ కథలలో సమకాలీన అన్యాయాలు, మానవత ప్రబోధమూ, నిండి ఉన్నై అని సోదాహరణగా చెప్పారు. ఈ మధ్యనే 'సప్తతి' పూర్తి చేసుకున్న కవి, విమర్శకులు జి. సుబ్బారావుకి, ఈ సందర్భంగా అద్దేపల్లి ఫౌండేషన్ తరుపున కలనాథభట్ట వెంకటరామశాస్త్రి ఘన సత్కారం చేశారు. భిలాయి నుండి వచ్చిన ప్రముఖ విమర్శకులు గూడ శ్రీరాములు 'విమర్శలోని సృజనాత్మకత' గూర్చి ప్రసంగించారు. తర్వాత 'రైల్వేస్టేషన్' అనే అంశంపై కవి సమ్మేళనం జరిగింది. ప్రభు, రామకృష్ణ శ్రీవత్స, జి. సుబ్బారావు గరికిపాటి మాస్టారు, శ్రీహస్త, కాలనాథభట్ట, అడపా, మొదలైనవారు కవితలు చదివారు. గ.నా.రా. వందన సమర్పణతో సభ ముగిసింది. సభకు అద్దేపల్లి అధ్యక్షత వహించారు.



## జాషువా 118వ జయంతి సందర్భంగా కథ / పద్య కవితల పోటీ

జాషువా పరిశోధన కేంద్రం తరపున జాషువా 118వ జయంతిని పురస్కరించుకుని కథ / పద్య కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు తెలుగు అకాడమీ సంచాలకులు కె. యాదగిరి ఒక ప్రకటనలో తెలిపారు. సామాజిక జీవిత చిత్రణ, సామాజికత ఉన్న కథలను, పద్య కవితలను సృజనశీలురైన రచయితలు, కవుల నుండి ఆహ్వానిస్తున్నట్లు తెలిపారు. వచ్చిన కథల్లోంచి న్యాయనిర్ణేతలు ఎంపిక చేసిన 25 కథలకు బహుమతులిస్తామని, వాటినే సంకలనంగా కూడా తెస్తామని తెలిపారు. ఎంపికచేసిన యాభై పద్యకవితలతో కూడా సంకలనం తేనున్నట్లు తెలిపారు. సెప్టెంబరు 27, 28 తేదీలలో హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో జరిగే జాషువా జయంత్యుత్సవాలలో పుస్తకావిష్కరణలు, విజేతలకు బహుమతి ప్రధానం చేయనున్నట్లు తెలిపారు. కథలను / పద్య కవితలను జులై 31లోపు కన్వీనర్, జాషువా పరిశోధన కేంద్రం, తెలుగు అకాడమీ, హిమయత్‌నగర్, హైదరాబాదు- 500 029 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు ఫోన్ 040-23220244 ద్వారా సంప్రదించవచ్చును. అలాగే పూర్తి వివరాల కోసం **www.teluguacademy.net/pub.jpg** చూడవచ్చు.

## అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి



అనంతపురంలోని భగత్‌సింగ్ నగరపాలక ప్రాథమిక పాఠశాలలో అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి సభ జరిగింది. ఈ సమావేశానికి సాహితీస్రవంతి అనంతపురం జిల్లా అధ్యక్షులు పి. కుమారస్వామి అధ్యక్షత వహించారు. ప్రముఖ కవి మల్లెల నరసింహమూర్తి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఆయన మాట్లాడుతూ 1910 ఏప్రిల్‌లో జన్మించిన శ్రీశ్రీ వ్యక్తికాదు శక్తి అన్నారు. 1933 నుండి 1940 మధ్య ప్రపంచం మొత్తం ఆకలిచావులతో ఉన్నకాలంలో అట్టడుగు వర్గాల కోసం రాసిన కవిత్వమే మహాప్రస్థానమని గుర్తు చేశారు. ఇదే సందర్భంలో 'యోగ్యతాపత్రం'లోని చలం రాసిన 'ఇది మహాప్రస్థానం' సంగతి కాదు ఇదంతా చలం గొడవ, ఇష్టం లేని వాళ్ళు పేజీలు తిప్పేసి శ్రీశ్రీ అర్ణవంలో పడండి. పదండి ముందుకు అగాధంలోంచి బైలుదేరే నల్లని అలలు మోహన కొట్టి...' అనే మాటలను గుర్తుచేశారు. సాహితీస్రవంతి అనంతపురం జిల్లా ప్రధాన కార్యదర్శి తగరం క్రిష్ణయ్య మాట్లాడుతూ "శ్రీశ్రీ ఉద్వేగమైన కవిత్వం రాయటమే కాకుండా, తన మాటలలో చమత్కారం తొణికిసలాడేదని అన్నారు. తన స్నేహితుడు నాటిక రాయమని అడిగితే 'రాస్తాను మిత్రమా ఏనాటికైనా' వంటి చమత్కార సంభాషణలెన్నో చేసేవారని అన్నారు. ఈ కార్యక్రమంలో సహాయకార్యదర్శి ఆకుల రఘురామయ్య, షేక్ రియాజుద్దీన్ అహ్మద్, జూటూరు షరీఫ్, ప్రగ్న సురేష్, వై. నారాయణరెడ్డి, మధురశ్రీ, వెంకటేషు, వెంకటేశ్వర్రావు, యమునారాణి, బి.కె. నారాయణ, నూర్జహాన్ తదితరులు పాల్గొన్నారు.



**సాహితీస్రవంతి అనంతపురం నగర కమిటీ సమావేశం నగర పాలక ప్రాథమిక పాఠశాలలో జరిగింది. అనంతపురం సాహితీస్రవంతి జిల్లా అధ్యక్షులుగా పి. కుమారస్వామి ఎన్నికయ్యారు. జిల్లా ప్రధాన కార్యదర్శిగా తగరం కిష్టయ్య, నగర కమిటీ అధ్యక్షులుగా వై. నారాయణ రెడ్డి, ప్రధాన కార్యదర్శిగా ప్రగ్న సురేష్, ఉపాధ్యక్షులుగా వెంకటేశ్వరరావ్, సహాయ కార్యదర్శిగా యమున రాణి, కోశాధికారిగా వెంకటేశ్వర్లు, కమిటీ సభ్యులుగా మధురశ్రీ, నూర్జాహాన్, బి.కె. నారాయణ, రాజశేఖర్‌లు ఎన్నికయ్యారు.**

## సృజనాత్మక ప్రతీక శ్రీశ్రీ రచనలు

మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) రచనలు సృజనాత్మకతకు ప్రతీకగా, అందరికీ ఆదర్శంగా నిలుస్తాయని పలువురు సాహితీవేత్తలు కొనియాడారు. మహాకవి శ్రీశ్రీ 30వ వర్ధంతి సందర్భంగా శ్రీశ్రీ సాహిత్య నిధి 50వ ప్రచురణ శ్రీశ్రీ క్విజ్ సంపుటి-1ని విజయవాడ, గాంధీనగర్‌లోని ప్రెస్‌క్లబ్‌లో జూన్ 16న ఆవిష్కరించారు. ప్రజాసాహితీ సంపాదకులు కొత్తపల్లి రవిబాబు అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో 'చినుకు' మాసపత్రిక సంపాదకులు నండూరి రాజగోపాల్ ఈ సంపుటిని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ శ్రీశ్రీ లేని తెలుగు భాషను మనం ఊహించలేమన్నారు. మార్క్సిస్టు భావజాలాన్ని కవిత్వంలో పొదగటం శ్రీశ్రీకి కుదిరినంతగా మరెవరికీ సాధ్యం కాలేదని మార్క్సిస్టు సిద్ధాంతకర్త మాకినేని బసవపున్నయ్య పేర్కొన్న విషయాన్ని ఆయన ఈ సందర్భంగా గుర్తుచేశారు. అలాగే సింగంపల్లి అశోక్‌కుమార్ ప్రచురించిన శ్రీశ్రీ క్విజ్ -1 గురించి ప్రస్తావిస్తూ ప్రస్తుత కాలాన్ని అనుసరించి ఆబ్జెక్టివ్ విధానంలో పుస్తకాన్ని అందుబాటులోకి తీసుకొచ్చారని, ఈ ప్రయత్నం అభినందించదగినదని తెలిపారు. విరసం నాయకులు చలసాని ప్రసాద్ మాట్లాడుతూ ఈ క్విజ్ కథ శ్రీశ్రీ ఆత్మకథలా అనంతంగా సాగేదే కాని ఆగేది కాదన్నారు. జనసాహితీ నాయకులు దివికుమార్ మాట్లాడుతూ శ్రీశ్రీ గురించి ఎన్ని విషయాలు తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవాల్సే ఉంటుందన్నారు. అంతులేని నిధిలా నిరంతరంగా పోగుపడుతోందన్నారు. అరసం నాయకులు పెనుగొండ లక్ష్మీనారాయణ మాట్లాడుతూ పద ప్రహేళికలకు తెలుగులో అధ్యుడు శ్రీశ్రీ అని, ఆయన తెలుగు భాషకు చేసిన సేవ కూడా గొప్పదని అన్నారు. ఈ పుస్తకాన్ని వామపక్ష సాహిత్య సంస్థలకు అంకితం ఇస్తుండడం సింగపల్లి చైతన్య సాహిత్య హృదయాన్ని సూచిస్తోందన్నారు. కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ ప్రతి ఒక్కరూ పుస్తకాలను బహుమతులుగా పలువురితో పంచుకునే సంస్కృతిని అలవర్చుకోవాలని కోరారు.

# సంఘర్షణ పథం వైపు సాహిత్యం




గురజాడ సంస్కరణల వైపు సాహిత్యాన్ని తీసుకొస్తే శ్రీశ్రీ సంఘర్షణవైపు సాహిత్యాన్ని తీసుకెళ్లారనీ, శ్రామిక జనావళి వైపు మళ్లించి కవిత్వాన్ని కొత్తపుంతలు తొక్కించారని సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, ప్రజాశక్తి సంపాదకులు తెలకపల్లి రవి అన్నారు. శ్రీశ్రీ 30వ వర్ధంతి సందర్భంగా శ్రీశ్రీ విజ్ఞాన కేంద్రం 'సాహిత్యం - సంస్కృతి-మీడియా'పై విశాఖలోని పౌర గ్రంథాలయంలో జూన్ 15న ఏర్పాటు చేసిన సభలో ఆయన ముఖ్యవక్త. ఈ సందర్భంగా రవి శ్రీశ్రీ రచనలను ప్రస్తావిస్తూ మహా ప్రస్థానమంటే మరణం కాదు పోరాట మార్గంగా కొత్త అర్థం తీసుకొచ్చారని, జగన్నాథ రథచక్రాలు, సింధూరం అన్న పదాలకు కొత్త అర్థాలు తెచ్చి భాషకు కొత్త శక్తిని తెచ్చారని, అభ్యుదయ శక్తులతో ఆయన పోరాటాల్లో కూడా పాల్గొన్నారని ప్రస్తుతించారు. కవుల్ని అనధికార శాసనకర్తలుగా పేర్కొంటారని చెబుతూ అసహాయుల తరుపున ప్రశ్నించే, ప్రజల తరపున నడిచే శాసనసభ ఉంటే శ్రీశ్రీది సభాపతి స్థానమని చెప్పారు. తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచే మహాకవి శ్రీశ్రీ అని, ఆధునిక సాహిత్యంలో గురజాడని ఆదికవిగా పేర్కొంటూ ఆయన ప్రారంభించిన అభ్యుదయ సాహిత్యాన్ని కొనసాగించిన కవి శ్రీశ్రీ విశాఖ వారేనని చెప్పారు. శ్రీశ్రీకి ఉన్నన్ని స్మారక కేంద్రాలు ఏ కవికీ లేవని చెబుతూ ఇది ప్రజలపై ఆయన ప్రభావానికి చిహ్నమని పేర్కొన్నారు.

ప్రజల జీవితంలోంచే సంస్కృతి వస్తుందనీ, ఆధిపత్యం, అణచివేత వర్గాల మధ్య సంఘర్షణలోంచి సంస్కృతి ఉంటుందనీ రవి పేర్కొన్నారు. ఇప్పుడున్న దాన్ని గ్లోబల్, ఆధిపత్య, డాలర్ సంస్కృతిగా అభివర్ణించారు. శకలీకరణ, వికలీకరణ, వెకిలీకరణ సంస్కృతి విజృంభిస్తున్నాయని అన్నారు. ప్రపంచమంతా ఒక్కటే అని చెబుతూ.. ప్రతి ఒక్కరినీ విడివిడి వినిమయదారుడిగా మారుస్తోందని చెప్పారు. ప్రస్తుత సాహిత్యంలో గత వైభవ స్మరణ, మృతవైభవ స్మరణ అనే ధోరణులను ప్రస్తావించారు. మానవ సంబంధాలను వికలంచేసే వికలీకరణ ఉందని అన్నారు. గ్లోబలైజేషన్ అంటే గ్లోబల్ బలిపీఠంపై బలిచేసే సంస్కృతీకరణ జరుగుతోందన్నారు. ఆధిపత్యం, వాణిజ్యం, వ్యక్తిస్థాయిలో ప్రలోభపెట్టే సంస్కృతి పెరుగుతోందని అన్నారు. బిక్షువర్షీయసి కవితలో 'ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరిదని' శ్రీశ్రీ ప్రశ్నించాడని చెప్పారు. నేటి సంస్కృతి తల్లులను బస్టాండ్లలో విడిచిపెట్టే విధంగా మార్చివేస్తోందని ఆవేదన వ్యక్తం చేశారు. మీడియా స్వభావం గురించి మాట్లాడుతూ.. ప్రస్తుతం మీడియా నడిపించబడుతోందనీ, మీడియా ద్వారా అంగీకార సృష్టిచేస్తున్నారనీ చెప్పారు. ఇప్పుడున్నదాన్ని బజారు సంస్కృతిగా, మాయాబజార్ సంస్కృతిగా పేర్కొంటూ అందులో మీడియాని మాయా పేటికగా అభివర్ణించారు.

ప్రముఖ రచయిత రామతీర్థ మాట్లాడుతూ మీడియాని అవసరమైన దెయ్యాలుగా పేర్కొంటూ 24 గంటల న్యూస్ ఛానళ్ల అవసరాన్ని ప్రశ్నించారు. టివి ద్వారా దుర్మార్గమైన సంస్కృతి ఆవిర్భవించిందనీ, మీడియా ద్వారా సామాజిక ఆత్మహత్య జరుగుతోందని విమర్శించారు. ఒక్కో మీడియాలో ఒక్కోంకమైన కథనాల రావడాన్ని బట్టి మోసపోతున్నది మనమన్నది ప్రజలు అర్థం చేసుకోవాలని అన్నారు. శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని చైతన్యవంతమైన చోదక సాధనంగా పేర్కొన్నారు. సదస్సుకు అధ్యక్షత వహించిన శ్రీశ్రీ విజ్ఞాన కేంద్ర ప్రధాన కార్యదర్శి వివిఎస్ పద్మనాభరాజు మాట్లాడుతూ మానవాళి విముక్తికోసం, నవ సమాజం కోసం శ్రీశ్రీ సాహిత్యం ద్వారా కృషి చేశారని చెప్పారు. శ్రీశ్రీ విజ్ఞాన కేంద్రం ట్రస్టును నూతనంగా ఏర్పాటుచేసినట్టు పేర్కొంటూ ట్రస్టు సభ్యులను పరిచయంచేశారు. ఈ ట్రస్టుకు ఉత్తరాంధ్ర పట్టభద్రుల ఎంఎల్‌సి ఎంవిఎస్ శర్మ మేనేజింగ్ ట్రస్టీగా వ్యవహరిస్తారని చెప్పారు. సాహితీ స్రవంతి విశాఖ నగర కన్వీనర్ శ్రీనివాస్ తదితరులు ప్రసంగించారు.




కిన్నెర సంస్థ హైదరాబాద్ త్యాగరాయగాన సభలో నిర్వహించిన సభలో డా. ద్వానాశాస్త్రి రచించిన 'తెలుగు సాహిత్యంలో హాస్యామృతం' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న డా. సినారె, డా. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్. చిత్రంలో రావికొండలరావు, డా. రాళ్ళబండి కవితాప్రసాద్, జి. వల్లీశ్వర్, కిన్నెర రఘురాం, డా. ఓలేటి పార్వతీశంలు ఉన్నారు.



హైదరాబాద్ త్యాగరాయ గానసభలో సచ్చిదానంద కళాపీఠం నిర్వహించిన సభలో డా. ద్వానాశాస్త్రిని సత్కరిస్తున్న డా. సినారె. చిత్రంలో త్రినాథరావు, ఆర్. దిలీప్ రెడ్డి, కళాదీక్షితులు, రత్నాకర శర్మలు ఉన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# చెరబండరాజు

## 03.01.1944 - 02.07.1982



అసలు పేరు బద్దం భాస్కరరెడ్డి, పేద రైతు కుటుంబంలో పుట్టాడు. హైదరాబాద్‌లో టీచరుగా పని చేశాడు. ఆరుగురు దిగంబర కవుల్లో ఒకడు. 'నన్నెక్కనివ్వండి బోను'తో కవితాలోకంలో సూర్యుడిలా పొడుచుకొచ్చాడు. విరసం వ్యవస్థాపక కార్యవర్గ సభ్యుడు. కార్యదర్శిగా (1971-72) కూడా పని చేశాడు. దిగంబరకవి నుంచి విప్లవకవిగా మారాక పాటలు విరివిగా రాశాడు. విరసం మీద ప్రభుత్వం బనాయించిన సికింద్రాబాద్ కుట్రకేసులో ముద్దాయి. దిక్సూచి', 'ముట్టడి' 'గమ్యం', 'జన్మహక్కు' కవితా సంపుటాలు, 'ప్రస్థానం', 'మాపల్లె' నవలలు, 'గంజినీళ్ళు' నాటికలు, 'చిరంజీవి' వగైరా కథలు రాశాడు. ప్రభుత్వం చెరబండరాజుని నిరుద్యోగానికీ, అనారోగ్యానికీ గురి చేసి బలి తీసుకుంది. మెదడు కాన్సర్‌తో మరణించాడు.

